ఈ సంచిక

ఇరవయి అయిదేళ్ళనాటి తెలంగాణ పీడిత రైతాంగ

సాయుధ పోరాట

జనచైనా అక్టోబరు విప్లవ

సంస్మరణ ఈ సృజన

ప్రతులకు, వివరాలకు :

సృజన

హనుమకొండ

వరంగల్ - 506001

విడిప్రతి: ఒక రూపాయి

అర్ధసంవత్సర చందా: ఆరు రూపాయలు

సంవత్సర చందా: పది రూపాయలు

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh Hyderabad. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

---

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam,
J. P. N. Road, Warangal-506002 (A.P.)

# విప్లవ రచయితల సంఘం

## మహాడవ మహాసభలు

## 15, 16 అక్టోబర్ 1972

## గుంటూరు

1) 15, 16 తేదీలు రెండురోజులు సాయంత్రం గాంధీపార్కులో బహిరంగ సభలు ఉంటాయి.

2) బహిరంగ సభల తర్వాత సాంస్కృతిక ప్రదర్శనలు ఉంటాయి.

3) ప్రతినిధులు అక్టోబర్ 14 వ తేదీ రాత్రి 12 గంటలలోపున గుంటూరు చేరుకొని 15 ఉదయానికల్లా తమ అర్హతలు నిరూపించుకోవాలి.

4) కొత్తగా సభ్యులుగా చేరదలుచుకొన్నవారు—ప్రధానకార్యదర్శి, విరసం. 2-2-982 అంబర్‌పేట, హైదరాబాదు 500013 కు రాసి ఫారాలు తెప్పించుకోవలెను.

5) 14వ తేదీ ఉదయంనుంచి బస్‌స్టాండ్‌లోనూ, రైల్వే స్టేషన్‌లోనూ వాలంటీర్లు వుంటారు.

ఇంకా వివరాలు కావలసినవారు

సి. సత్యం, టొబాకో కాలనీ, గుంటూరు 522001 కి రాయగలరు.

విరాళాలు : కిరణ్‌బాబు, 2/18 బ్రాడీపేట, గుంటూరు 522002 కు పంపించ ప్రార్థన.

విరివిగా విరాళాలు పంపించి
అధిక సంఖ్యలో పాల్గొని **సభలు జయప్రదం చేయండి.**

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

1972 అక్టోబర్ మాసపత్రిక 37

## ఉద్యమమే ఉత్సవం

పాలకవర్గం స్వాతంత్ర్య రజితోత్సవాలు జరుపుకున్న ఏడే పీడిత వర్గం సాయుధపోరాట రజితోత్సవాలు జరుపుకుంటున్నది. ఇది తెభాగా తెలంగాణల ఆచరణాత్మక సంస్మరణ.

నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగ ప్రారంభమయిన హైదరాబాదు సంస్థాన జాతీయ పోరాటం, శ్రామికవర్గ పార్టీ నాయకత్వంలో భూస్వామ్య వ్యతిరేక సాయుధ రైతాంగ పోరాటంగ వర్ధిల్లింది. 1946-51 మధ్యకాలం హైదరాబాదు సంస్థానం, మరీ ముఖ్యంగ తెలంగాణ-భారతదేశంలో అంతకు ముందు కనివిని ఎరుగని విప్లవచేవను చాటింది. నల్లగొండ, వరంగల్ (ఈనాటి ఖమ్మంజిల్లాకూడ) కరీంనగర్ జిల్లాలలో వేలకొలది గ్రామాలు నైజాం నిరంకుశపాలననుంచి, భూస్వాముల క్రూర పంజాలనుంచి విముక్తమయి శ్రామికవర్గ పార్టీ జెండాకింద చేరినయి.

సరిగ్గ యిదే సమయంలో ఢిల్లీలో మూడురంగుల జెండా ఎగిరింది. అంగిరేజులది ఒకటేరంగు. కాంగిరేచులవి బహురంగులు. అయినా ఆనాడే 'రింగురింగులమారి నెవురయ్యా, నీ రంగూ బయిరంగమాయె నెవురయ్యా' అని జాతీయ బూర్జువా నాయకత్వాన్ని ఎండగట్టిన వర్గ దృక్పథం తెలంగాణ సాయుధ పోరాటానికి జీవనాడిగా స్పందించింది. కాని పార్టీ నాయకత్వం మాత్రం పటేల్-పట్వారీ(నెహ్రూ)ల యూనియన్ మిల్ట్రీ చేసిన మానభంగాల్లో, గృహదహనాల్లో, లూటీల్లో, ఏరి ఏరి వేలమంది కార్యకర్తలను కాల్చేసిన దమనకాండలో సోషలిస్టు శాంతి కపోతాల కూజితాలు, రెక్కల రెపరెపలే విన్నది. పోరాటం విరమించబడ్డది.

తెలంగాణ సాయుధ పోరాటానికి నాయకత్వంవహించిన పెటీబూర్జువా నాయకత్వం అలసిపోయింది. నాయకుని ప్రతి అలసటా ఒక కొత్త సిద్ధాంతమవుతుంది. మార్క్సిస్టు-లెనినిస్టు ఎర్రపూలను మాటల దుమ్ము కప్పేస్తుంది.

ఇరవయి ఏళ్లు గడిచిపోయినయ్. తెలంగాణ నుంచి నక్సల్‌బరీదాక భుజంమీది తుపాకీ దించకుండా ప్రవాసంలో, విశ్వాసంతో గడిపిన గెరిల్లా బూడిద అడుగున దాగిన నిప్పువలె గుప్పుమన్నడు. నక్సల్‌బరీ, శ్రీకాకుళం తెభాగ, తెలంగాణ సాయుధ పోరాట వారసత్వాన్ని స్వీకరించినయ్.

ఇవ్వాళ తెలంగాణలోకూడ యిదివరకు పోరాటం నడిచిన ప్రాంతాల్లో మళ్ళ పోరాటం సాగుతున్నది. ఇన్నాళ్ళ అనుభవంతో, మరింత అవగాహనతో స్పష్టమైన శాస్త్రీయ పంథాను ఎంచుకొని తెలంగాణ తన పోరాట సంప్రదాయాన్ని తాను నిలుపుకుంటున్నది.

పాలకవర్గం ఆవు రైతును తన్ని దూడనోట్లో ఎండిన పొదుగు పెట్టి వెండిసింగారం చేసుకొని దేశంనిండ గంగిరెద్దు వేషంలో తిరుగుతున్నది. ఆయుధాలు దించి, పీడితులు సాయుధులు కావాలన్న సిద్ధాంతమే ఖండించి, వర్గ సామరస్యాలు చెప్తున్న పార్టీ సాయుధ పోరాట రజితోత్సవాల పేరుతో చెట్టుపేరు చెప్పుకొని కాయలమ్ముకోజూస్తున్నది. (అసలు యీ రివిజనిస్టులు చేస్తున్నది ఇండియన్ యూనియన్ మిలిట్రీ సాయుధ పోరాట రజితోత్సవాలైతే కావుగదా!) కన్నబిడ్డను ఎత్తుకోనూలేక, పారేయనూలేక అటు రుషికాకుండ ఇటు రాజుగాకుండ పోయిన విశ్వామిత్రపార్టీ తనకొరకే ఒక త్రిశంకుస్వర్గం నిర్మించుకున్నది. ఈ వేడుకల మ్యూజికల్‌చేర్‌లో స్థానం దొరుకని అంబేద వలె దిక్కులుచూస్తు నిలబడ్డది.

తెలంగాణ విప్లవ రైతాంగం మాత్రం సాయుధ పోరాటాలు సాగిస్తూ బలిదానాలతో, త్యాగాలతో, విజయాలతో సాయుధ పోరాట రజితోత్సవాలను జరుపుకుంటున్నది. శాస్త్రీయమయిన త్యాగమే నూతన మానవుణ్ణి ఆవిష్కరిస్తుందని వాళ్ళకు తెలుసు.

# ప్రపంచ విప్లవ కేంద్రం

జనచైనా అక్టోబర్ విప్లవానికి యింకా యిరువయి అయిదేళ్ళు నిండలేదు. ఇవ్వాళ చైనా ప్రపంచ విప్లవాలకు కేంద్రంగా, విముక్తిపోరాటాలకు బాసటగా వెలుగుతున్నది.

ఆరేళ్ళక్రితం జనచైనాలో ప్రారంభమయిన సాంస్కృతిక విప్లవం చైనా ప్రజలందరు మంచి కమ్యూనిస్టులుగా, నూతన మానవులుగా తమను తాము తీర్చి దిద్దుకోవడానికి, స్వచ్ఛందంగా, కాని అనివార్యంగా తమ మీద తామే ప్రకటించుకున్న అపూర్వమైన విప్లవం. రెడ్‌గార్డుల కొత్త వరద వచ్చి చైనా సంస్కృతిలో నిలవనీళ్ళైన పాత ఆలోచనలను తుడిచిపెట్టేసింది.

జనచైనా ఒక్కటే యీనాడు ప్రపంచంలో అప్పులేనిదేశం. ఆసియాలో స్వయం పోషకమైన దేశం. పెట్టుబడిదారీ విధానం ఏ నటనలతోనూ ప్రవేశించ వీలులేకపోతున్న దేశం. ప్రపంచంలోని చిన్నచిన్న దేశాల తరఫున, వాటి స్వాతంత్ర్యంపట్ల పరిపూర్ణమైన గౌరవంతో, అమెరికా రష్యాల సూపర్ పవర్ ఆధిక్యాన్ని సవాల్‌చేస్తున్న జనశక్తి యీనాటిచైనా. ఇదంతా ఎట్లా సాధ్యమైంది!

విపరీతమైన జనాభాసమస్య, ఎన్నోతీర్ల మూఢనమ్మకాలు, అజ్ఞానం, మతం నల్లమందు, ప్రకృతి వైపరీత్యాలు, దారిద్ర్యం, బానిసత్వం ఇవేవీ మనకన్న తక్కువకాకుండా యింకా ఎక్కువగానే రెండేరెండు దశాబ్దాలకు పూర్వం అనుభవించిన చైనా యీనాడు ఇంత ప్రగతిని ఎట్లా సాధించగలిగింది- మనమెందుకు యిలావున్నాం. మౌలికమైన తేడా ఏమిటంటే- ఇరవయి అయిదేళ్ళనాటి భారతదేశ స్వాతంత్ర్యం ప్రజా స్వాతంత్ర్యంకాదు. దేశీయ బూర్జువా నాయకత్వం దేశ సంపదలమీద, ఉత్పత్తిమీద స్వాధీనం చేసుకున్న అధికారంమాత్రమే. అందుకే యీ అప్పులు, ఆకలి చావులు, కృత్రిమ కాటకాలు.

ఇకచైనా-అక్టోబర్ విప్లవ విజయం చైనాలో మార్క్సిజం- లెనినిజం సాధించింది. చైనాలోవున్న ప్రగతివాదులు, తమదేశం సమస్యలగురించి,

దాని పరిష్కారాలగురించి శాస్త్రీయంగ ఆలోచించి అంతర్జాతీయ శ్రామిక దృక్పథాన్ని ఆచరణపంథాగా ఎంచుకున్నారు. ఆ పంథాయే యీ ప్రగతికి మూలం.

అక్టోబర్ విప్లవం చైనా చరిత్రనేకాదు ప్రపంచ చరిత్రనుకూడ మార్చేసింది. మార్చేస్తుంది. ఈనాటి మార్క్సిజం-లెనినిజం అయిన మావో ఆలోచనావిధానం చైనాను, ప్రపంచ విముక్తిపోరాటాలను నడిపిస్తున్న వెలుగుబాట.

ఈ మార్గం సులభమయిందేమీకాదు. పూలబాటకాదు. షార్ట్‌కట్ మార్గమూకాదు. ఎడారులు, పర్వతాలు, అరణ్యాలు అధిగమించి రక్తసిక్త నదీనదాలు ప్రవహింపచేసి చేరుకోవలసిన గమ్యం.

ఇది లాంగ్‌మార్చ్ — దీర్ఘకాలిక సాయుధపోరాటం. అయినా ఈ పోరాటం అడ్డంకులను అధిగమిస్తుంది. శత్రువుల తుపాకీగుండ్లను పువ్వుల వలె స్వీకరిస్తూ సాగిపోతుంది.

లాంగ్‌మార్చ్ మార్గంలో
పర్వతాలె గులకరాళ్ళు
లాంగ్‌మార్చ్ మార్గంలో
మహానదులె కాలువలు
లాంగ్‌మార్చ్ మార్గంలో
కారడవులె కాలిబాట.

మావో నాయకత్వంలో చైనాలోచేసిన 'లాంగ్‌మార్చ్' వెంటనే విజయాన్ని సాధించలేదు. రిట్రీట్ అయింది. పైకి, అది వెనక్కి తగ్గినట్లు కనిపించింది. కాని 'ప్రతి ఓటమిగర్భంలో విజయాన్నే వీక్షించిన' ఎర్రసేన బెదిరిపోలేదు. అందుకే అది విక్టోరియస్ రిట్రీట్ — విజయవంతమైన వెనుకడుగు.

చైనా చరిత్ర, జనచైనా విప్లవం, సాంస్కృతిక విప్లవం- ఈనాడు సాయుధ పోరాటాలు నిర్వహిస్తున్న వివిధ దేశాల శ్రమజీవుల పార్టీలకు ఒరవడి.

—సంపాదకుడు.

## అమ్మా !

శివసాగర్

అమ్మా !
ఆ సమాధి వద్ద
అలా ఎందుకు ఏడుస్తావు ?
నీలో నీవే కుమిలి కుమిలి
ఎందుకు ఏడుస్తావు ?

ఆ సమాధిలో నువు పెంచిన
నీ కోసం పోరాడిన కొడుకు లేడు.
అప్పుడే అతడు ఒళ్ళు విరుచుకొని
సమాధి నుండి లేచి, ఆయుధం చేతపట్టి
తిరిగి రణరంగం చేరినాడు.

అమ్మా ! కళ్ళు తుడుచుకొని
ఆశీర్వదించు పోరాటాన్ని.

(విప్లవనేత, కార్యశూరుడు, చారుశీలుడు చనిపోయినపుడు శోకంలో)

# విప్లవ కవిగా మావో

చార్వాక

మావో విప్లవనేత: విప్లవ కవి.

మావో గీతాలు (కొన్ని) డ్రిల్లింగ్ సాంగ్స్. వార్ డ్రమ్స్. అవి తాత్విక సమాలోచనలు.

నిన్నటి చైనా విముక్తి పోరాటం, నేటి సోషలిస్టు సమాజ నిర్మాణోద్యమం, రేపటి మానవజాతి మహోజ్వల భవిష్యత్తు— ఇవి మావో గీతాలకు ఊపిరి.

ప్రజలపై ప్రగాఢ విశ్వాసం, అంతిమ విజయంపై అంతులేని నమ్మకం, విప్లవ ఆశావహ దృష్టి (రివల్యూషనరీ ఆప్టిమిజం), మావో కవితకు ప్రాణ స్పందన.

ఆయన విప్లవ జీవితమే ఆయన కవితలో ప్రతిఫలించింది.

చిన్ననాడు చాంగ్షాలో మావో చదువుకున్నారు. చాల సంవత్సరాలకు ఆయన తిరిగి చాంగ్షా వచ్చినప్పుడు "ఈ శిశిరంలో వసంత స్వప్నాలు" అనే కవిత వ్రాశారు. అది ప్రకృతి వర్ణనలతో ప్రారంభమై, "ఈ ప్రకృతి అధినేతలెవరు?" అనే తాత్విక సమాలోచనతో పతాకస్థాయి నందుకొంటుంది.

ఈ శిశిరంలో వసంత స్వప్నాలు

ఈ శిశిరంలో
ఒంటరిగా నిల్చొని
చూస్తున్నాను
ఎన్నెన్ని మనోహర దృశ్యాలు!

ఈ శిశిరంలో
ఒక్కడినై
కంటున్నాను
ఎన్నెన్ని వసంత స్వప్నాలు!

ఆరంజ్ ద్వీపతీరాన్ని
వొరుసుకుంటూ
ఉరకలువేస్తూ సియాంగ్ నది!

పర్వతశ్రేణుల పాదాలకు
పారాణి పూసే
రక్తారుణ అరణ్యాలు!

వినీలాకాశం లాంటి
విశాల ప్రవాహంలో
ఓలలాడే పడవల పడుచులు!

ఆకాశ అహంభావాన్ని
తూల గొడుతూ
డేగల చంక్రమణాలు
అలల్లో ఆడుకునే చిరుచేపలు!

ఓహో! ఘనీభవిస్తున్న
ఈ గగనం కింద
రగిలే కోట్లాది జీవుల
స్వేచ్ఛా పోరాటాలు!

ఓహో! ఘనీభవిస్తున్న
ఈ గగనం కింద
అణువణువులోనూ
పగిలే విముక్తి పోరాటాలు!

చైతన్యం, ఈ కదలిక
ఈ జీవం, ఈ గానం
నా గుండెలు కదిలించగ
నిగ్గదీసి ప్రశ్నిస్తా:

తొంగి చూచు ఆకాశమ!
ఈ ప్రకృతి అధినేతలెవరు?
ఉప్పొంగే ప్రవాహమా!
ఈ ధరిత్రి నేతలెవరు?

ఈ కవిత రెండవభాగంలో ఆనాటి రాజకీయ వ్యవస్థనే సవాల్ చేసిన యువ తరాన్ని, "అలల్ని కొరడాలతో కొట్టిన రోజుల్ని" గుర్తు చేస్తారు.

1927-36 సంవత్సరాల మధ్య జరిగిన రెండవ విప్లవ అంతర్యుద్ధకాలంలో ఎని మిది గీతాలు వ్రాశారు. ఈ కాలంలోనే "చైనాలో ఎర్ర రాజ్యాధికారం ఎందుకు నిలు స్తుంది?", "చింకాంగ్ కొండల్లో పోరాటం", "ఒక నిప్పురవ్వ దావానలం సృష్టిస్తుంది" అనే సిద్ధాంత వ్యాసాలు వ్రాశారు. శాస్త్రీయ దృక్పథంతో వాస్తవిక పరిస్థితులను విచి కిత్సచేసి, వివేచన చేసి విప్లవ పురోగమనాన్ని, అంతిమ విజయాన్ని నిర్ధారించారు. ఈ వ్యాసాల్లో ఆయన చూపించిన ప్రజాశక్తిపై అచంచల విశ్వాసం, విప్లవ పురోగమ నంపైగల విశ్వాసమే యీ గీతాల్లో కవితగా సాక్షాత్కరించాయి.

చింకాంగ్ కొండల్లోని విప్లవ స్థావరంపై కుమింటాంగ్ సేనలు పెద్దఎత్తున దాడి జరుపుతున్న రోజుల్లో మావో "రణభేరి మ్రోగుతోంది"అనే ఈ గీతం వ్రాశారు.

"ఉప్పొంగే ప్రజాశక్తి, ఎర్రసేన సమరశక్తి అభేద్యమౌ దుర్గంగా శత్రుమూక ముందు నిలుచు" అంటారు.

రణభేరి మ్రోగుతోంది

పర్వత పాదాలవద్ద
ఎర్రజెండ ఎగురుతోంది!
పర్వత శిఖరాగ్రంపై
రణభేరి మ్రోగుతోంది!

రణభేరి మ్రోగుతోంది!
రణశంఖం పలుకుతోంది!

లక్షలాది శత్రుమూక
మనల చుట్టివేస్తున్నా
చలించదీ ఎర్రసేన
పిడికిలెత్తి నిలిచిపోరు.

ఉప్పొంగె ప్రజాశక్తి
ఎర్రసేన సమరశక్తి
అభేద్యమౌ దుర్గంగా
శత్రుమూకముందు నిలుచు

విన్నారా! హుయాంగ్ చీలో
వినిపించు ఫిరంగి మోత
శత్రుమూక కకావికలు!
శత్రుదాడి పరాజయం!

1930 - 33 లో కియాంగ్‌సి విప్లవ స్థావరంపై శత్రువు చేసిన నాలుగు పెద్ద దాడుల్ని ఎర్ర సేన ఓడిస్తున్న సమయంలో మావో "జడివానలు ముగియగానే సూర్యుని చిరునవ్వు వెలుగు" అనే కవిత వ్రాశారు. తుపాకి గుళ్ళ గుర్తుల్ని "తుది విజయం షరతులు" అంటారు.

జడివానలు ముగియగానె
సూర్యుని చిరునవ్వు వెలుగు!

---

ఇంద్రధనుస్సు కాంతుల్లో
ఆకాశం వేదికపై
రంగు రంగు పరదాలను
కదిలిస్తూ, కనుమరుగై
నృత్యం చేస్తున్నదెవరు?

లాలసగా, లాలనగా
గానం చేస్తున్నదెవరు?

జడివానలు ముగియగానె
సూర్యుని చిరునవ్వు వెలుగు
పర్వతశ్రేణులు, కనుమలు
కనువిందుగ కనిపించును

ఇచ్చోటనె గతంలోన
సంకుల సమరం జరుగగ
పూరిగుడిసె గోడలపై
తుపాకి గుళ్ళ గుర్తులు
భీకర పోరాట ఘడియ
ముద్రించిన గుర్తులు
తుది విజయం షరతులు!

నేడేమో! పర్వతాలు మరింతగా చిరునవ్వును

ఈ కాలంలోనే సంశయాత్మలను సున్నితంగా మందలిస్తూ మావో అంటారు :

"ముందె తొందరపడి లేచివచ్చామని
నిష్ఠురాలాడకోరన్నా ! నీవు నీలినిందలు వేయకన్నా !
సూర్యోదయం — అది ఎంతో దూరం లేదు
సూరీడు రాకను ఎవరడ్డలేరన్న !
నిష్ఠురాలాడకోరన్నా ! నీవు నీలినిందలు వేయకన్నా !"

1934 అక్టోబరులో ప్రపంచ ప్రసిద్ధమైన 'లాంగ్ మార్చ్' ప్రారంభమైంది. 1935 జనవరిలో తున్యీని ఎర్రసైన్యం ఆక్రమించింది. లూషాన్‌పాజ్‌ను దాటవలసి వచ్చింది. పరిస్థితి క్లిష్టంగా ఉన్నది. ఆ సమయంలో "ఆశయాల దీపికతో" కవిత వ్రాశారు. "నిబ్బరంగా ఉండండి, జబ్బచరిచి కదలండి" అని ఎర్ర సైన్యాన్ని ఉద్బోధిస్తారు.

ఆశయాల దీపికతో

మృత్యు శీతలంగా
వీస్తోన్న
పశ్చిమ పవనం !

ప్రత్యూషలో
వేలాడే చంద్రుడు
పాలిపోయిన శవం

దూరంగా మంచు గాడ్పులో
చంద్రుణ్ణి పలవరిస్తోన్న
అడివి బాతుల రొద !

మృత్యు గంటల్లా
మంటల్లా
మోగుతున్న, రేగుతున్న
గుర్రపు డెక్కల చప్పుడు !

మూగవోయి రణశంఖం !?
తీగ తెగిన అగ్నివీణ !?
ఎటు చూచిన పటు నిరాశ ?!

పటు నిరాశ తగదు తగదు
వెనుక చూపు వలదు వలదు
ఆశయాల దీపికతో
అగడ్తలను అధిగమించు.

ఓ కామ్రేడ్స్! నా కామ్రేడ్స్!
నిబ్బరంగా ఉండండి!
జబ్బ చరిచి కదలండి!

ఒక అంగలో లూషాన్‌ను
ఈరోజే దాటగలం
ఒక దెబ్బతో లూషాన్‌ను
ఈరోజే ఓడించగలం

రక్తం గ్రక్కుతు సూర్యుడు
కనుమూసే వేళ
లూషాన్ పాజ్ ప్రాంగణాన
ఎర్రజెండ ఎగురగలదు.

లాంగ్ మార్చ్‌కి నాయకత్వం వహించిన మావో ఈ సుదీర్ఘ కష్టయాత్రను గురించి "లాంగ్ మార్చ్" అనే సుప్రసిద్ధ గీతాన్ని వ్రాశారు.

"లాంగ్ మార్చ్ మార్గంలో పర్వతాలె గులకరాళ్ళు" అంటారు.

## లాంగ్ మార్చ్

లాంగ్ మార్చ్! లాంగ్ మార్చ్!
ఎర్రసేన బెదిరిపోదు
పర్వతాలు అడ్డురాని
నదీనదాలు అడ్డురాని
శత్రువులే ఎదురురాని
కష్టాలే వెంటరావి
కన్నీళ్ళే ఇంకిపోని
ఎర్రసేన బెదిరిపోదు.

లాంగ్ మార్చ్ మార్గంలో
పర్వతాలె గులక రాళ్ళు!
లాంగ్ మార్చ్ మార్గంలో
మహానదులు కాలువలు!

సువర్ణముఖి వరదల్లో
తలమునిగిన గిరులు, తరులు
టాటూనది వంతెనగా
ఊగులాడు ఇనుప గొలుసు
మంచు కటిక పిడికిల్లో
గిలగిలలాడే మిన్‌షాన్
వీటన్నిటి చూచి చూచి
ఎర్రసేన బెదరిపోదు.

ప్రతి విజయం పెదవులపై
చిరునగవుగ దీపించును
కష్టాలే కాటుకగా
వారి కనులు వికసించును.

అపజయాన్ని అధిగమించి
ఎర్రసేన జైత్రయాత్ర!

జైత్రయాత్ర! జైత్రయాత్ర!
దోపిడిపై దండయాత్ర!
లాంగ్ మార్చ్! లాంగ్ మార్చ్!
ఎర్రసేన బెదిరిపోదు.

కున్‌లున్ పర్వతాన్ని విశ్వశాంతికి, మానవ పురోగమనానికి అడ్డంగా నిలిచిన ప్రతిపక్తిగా ఊహించి మావో,

"కున్‌లున్!
ఎంత తలపొగరు
ఇంత ఎత్తుగా

చాలించు నీ దర్పం!
సహించలేం నీ అహం!
... ... ... ...
ఆకాశం అంచుమీద అనుకొని
నా ఖడ్గాన్ని ఒరనుండి దూసి
నిన్ను మూడు ముక్కలుగా ఖండిస్తాను
... ... ... ...
అపుడే శాంతి లోకంలో హసిస్తుంది!
అపుడే ఈ లోకంలో దానవత్వం నశిస్తుంది!" అంటారు.

జపాన్ ఫాసిస్టులు చైనాపై దండయాత్ర ప్రారంభించారు. జపాన్ దురాక్రమణను ప్రతిఘటించేందుకు ఎర్రసేన ఉత్తర దిక్కుగా కదులుతుండగా మావో,

"గ్రేట్ వాల్ చేరుకోందె మొనగాళ్ళం కాము-
జపాన్‌ను ఓడించక మేము తిరిగిరాము" అని శపథం చేస్తారు.

వర్తమాన చరిత్ర విశిష్టమైంది- మానవుడు దోపిడిని అంతిమంగా నిర్మూలిస్తున్న యుగం ఇది. వర్తమాన యుగానికి గతంతో పోలికలేదు. 'మంచు' అనే కవితలో మావో ఈ భావననే ఇలా ఆవిష్కరిస్తారు.

"టాంగ్‌తాయ్ సుంగ్, సుంగ్‌తాయ్ సు
జంగిజ్‌ఖాన్, తామర్లేన్
వీరులైన నేమిగాని
జనంమాట తలచలేదు
సామాన్యుని కొలువలేదు
... ... ... ...
ధీమంతులు విజ్ఞాన ఖనులు
హృదయంగల వీరులకై
గత చరిత్ర వెదకనేల
వర్తమాన చరిత చూడు."

1949 లో చైనా విముక్తమైంది. తన దేశ గత విషాదచరిత్రను సింహావలోకనం చేస్తూ, దేశ ఉజ్జ్వల భవిష్యత్తును చూస్తూ మావో 'నా దేశం' వ్రాశారు. 'నా దేశం సుదీర్ఘమైన రాత్రిలో బిక్కచచ్చి పోయింది' అని ప్రారంభించి 'కోడి కూసింది, మహోదయమయింది' అంటారు.

## నా దేశం

నా దేశం
సుదీర్ఘమైన రాత్రిలో
బిక్కచచ్చిపోయింది.

నా దేశంపై
సూర్యుడు
నెమ్మదిగా, మరీ నెమ్మదిగా
ప్రసరించాడు.

నాదేశంలో
వేలాది సంవత్సరాలు
భూతాలు గజ్జెకట్టి
విలయనాట్యం చేశాయి.

కోట్లాది ప్రజలు
అనైక్యతతో
ముక్క చెక్కలయ్యారు.

నేడేమో!
కోడికూసింది
మహోదయమయింది
సూర్యకాంతి జలాల్లో
నా దేశం జలకాలాడుతోంది
నలు దిక్కులనుండి
నేడు వినవస్తున్న మధుర సంగీతం
నాలో ఉత్తేజం నింపుతోంది.

సోషలిస్టు సమాజ నిర్మాణం ప్రకృతిపై అనేక విజయాలను సాధిస్తోంది. అజేయుడు మానవుడు పురోగమిస్తున్నాడు. 'ఈత' అనే కవితలో మావో :

" చాంగ్షా జలాల్లో దప్పిక తీర్చుకొని
విశాలాకాశం వైపు చూస్తున్నాను
... ... ... ... ...

ఉత్తరదక్షిణాలను
కలుపుతూ నిర్మిద్దాం వారిధి
అజేయుడగు మానవుడే
ప్రకృతి రథసారధి
... ... ... ...
ప్రకృతి 'దేవత'
ఇంకా ఉంటే గింటే
తనలో కలిగే మార్పుకు
తానే దిగ్భ్రాంతి చెందు" అని వ్రాశారు.

ప్రపంచ విప్లవ పరిస్థితి నేడు అద్భుతంగా ఉందనీ, సామ్రాజ్యవాదుల, రివిజనిస్టుల (కీటకాలు) కుట్రలు విఫలంకాక తప్పవనీ, మానవ పురోగమనయాత్ర ఆగదనీ ప్రతి నిమిషం, ప్రతి క్షణం విలువైనవనీ, సదా విప్లవ సన్నద్ధతతో ఉండాలని మావో 'అప్రతిహతం'లో అంటారు:

"ప్రపంచం దొర్లిపోతోంది
కాలమేమో తరుముతోంది
శత శతాబ్దాలు చాలా దూరం
ఈరోజే, ఈ నిముషమే
ఆలసించ కొక్క క్షణము
చతుస్సాగరాల్ పొంగుతున్నాయ్
నీటి మేఘాలు ఎగురుతున్నాయ్
అయిదు ఖండాలు అదురుతున్నాయ్
గాలీ, ఉరుములు గర్జిస్తున్నాయ్
కీటకాలన్నీ ధ్వంసం!
మా శక్తి అప్రతిహతం!"

ఆత్మీయులకు మావో వ్రాసిన గీతాలుకూడ ఉన్నాయి. నిరుత్సాహంలో కొట్టుమిట్టాడుతున్న ఒక కవి మిత్రుని అనునయిస్తూ 'నేస్తం'లో అంటారు:

<u>నేస్తం</u>

నేస్తం! కాంటన్‌లో మనిద్దరం కలిసి
ఖులాసాగా టీ తాగిన రోజులు

ఎన్నటికీ మరువలేను
అకురాలు కాలంలో ఛుకింగ్‌లో
మనిద్దరం కవితాగానం చేస్తూ
గడిపిన మధురక్షణాలు
ఎలా మరిచిపోను ?
ముప్ఫయి ఒక్క సంవత్సరాల తదుపరి
పెకింగ్ చేరాము
పూలు నిశ్శబ్దంగా రాలేవేళ
నీ సుందర మందార గీతాలను ఆలపిస్తున్నాను
నేస్తం! మోయలేని శోకంతో
నీ గుండెలు పిండుకోకు
లోకం పరిణామశీలి; దూరదృష్టి అవశ్యం.

ఒక మిడిల్‌స్కూల్ లేడిటీచర్‌కు 'అమరులు' అనే గీతం మావో వ్రాసిపంపారు. ఆమె భర్త విప్లవ పోరాటంలో మరణించాడు. ఆమె సన్నిహితురాలు, మావో భార్య అయిన యాంగ్‌కై హ్యు కూడ పోరాటంలోనే మరణించింది. ఆమెను ఓదారుస్తూ అమరులకు జేజేలర్పిస్తూ ఇలా అంటారు:

## అమరులు

నా మల్లియ రాలెను! నీ మొగిలికూడ రాలెను!
నా మల్లియ, నీ మొగిలి ఆకాశం చేరెను!

అమరత్వం వెదుకబోయి
శిక్షితుడైన ఉకాంగ్
అమరుల దప్పిక తీర్చను
మధుపాత్రల నందించును
చందమామ లోకంలో
ఛాంగ్ ఓ ఏకాంతదేవి
సహృదయులు అమరులకై
పసందుగ నాట్యము చేయును

దోపిడి రక్కసి సర్పం
మట్టి కరుచు వేళ

అమరుల ఆనందాశ్రువులు
జడివానగ కురియును.

నా మల్లియ రాలెను ! నీ మొగిలికూడ రాలెను !
నా మల్లియ, నీ మొగిలి ఆకాశం చేరెను !

చైనావిప్లవోద్యమ ఘట్టాలకు మావో కవితలు రక్తారుణ తోరణాలు. అవి చైనా విప్లవ క్షేత్రంలో కనువిచ్చిన ఎర్రని మందారాలు; ఎగరేసిన ఎర్రజెండాలు.

విప్లవ కార్యాచరణ, విప్లవ సిద్ధాంతం, విప్లవ సంస్కృతి,– ఈ త్రివేణీసంగమమే మావో మహోజ్వల జీవితం.

---

పాద దీపిక : ఇందులో మావో గీతాలను వ్యాసకర్త ఆంగ్లంనుండి స్వేచ్ఛాను వాదం చేయగా, 'అప్రతిహతం' గీతాన్ని అ.రా. అనువదించారు. మూలంలో మావో గీతాలకు శీర్షికలు వేరే ఉన్నాయి.

కొన్ని గీతాలకు మావో స్థలాలపేర్లు శీర్షికలుగా పెట్టారు. "ఈ శిశిరంలో వసంత స్వప్నాలు"అనే కవితకు మూలంలో "చాంగ్షా" అని శీర్షిక ఉంది. అలాగే "రణభేరి మ్రోగుతోంది" అనే గీతానికి "చింకాంగ్ కొండలు" అనీ, "జడివానలు ముగియగానే సూర్యుని చిరునవ్వు వెలుగు" అనే కవితకు "తపోతి" అనీ, "ఆశయాల దీపికతో"కు "లుషాన్ పాజ్" అనీ మాతృకలో శీర్షికలు.

మావో తన కవితామార్గం గురించి "కవిత" అనే సాహిత్య పత్రికా సంపాదకునికి ఇలా వ్రాశారు :

"నాది అధునాతన శైలికాదు. (ఓల్డ్ స్టయిల్).... యువతరం మీద నా కవితాశైలి మంచి ప్రభావం కలుగచేయదనీ, వారిలో మంచిధోరణిని ప్రోత్సహించదని భయపడు తున్నాను. ముఖ్యంగా నవ్యరీతుల్లో కవితలు వ్రాయాలని నేను భావిస్తున్నాను. క్లాసికల్ పద్ధతుల్లో (మావోపద్ధతి క్లాసికల్) ఎంతో కొంత మనం వ్రాసినా, యువతరాన్ని ఇదే మార్గంలోకి మనం ప్రోత్సహించటం తగదు. ఎందుకంటే వారి భావాలకు పురాతన రచనా పద్ధతులు సంకెళ్లు అవుతాయి." అని వ్రాశారు.

## తెలంగాణ పోరాట పాటలు :

సేకరణ : చార్వాక

[తెలంగాణ విమోచనోద్యమ సాయుధ పోరాటానికి ఇరవయ్ అయిదేండ్లు నిండినయ్. రజితోత్సవాల పేరుతో యీ గత చరిత్రను యివ్వాళ ఎవరి అవకాశాలకు అనుకూలంగా వాళ్లు చిత్రించ ప్రయత్నించినా, ఆ పోరాట హృదయం ఆనాడు ప్రజలు పాడుకున్న పాటల్లో, చెప్పుకున్న గాధల్లో యీనాటికీ మనకు అద్దంలా కనబడుతది. ఈ పోరాట చరిత్రకు మాకు తోచిన భాష్యమేదో మేం చెప్పడంకన్న ఆ పాటలే పాఠకుల ఆలోచనలకొరకు, నిర్ణయాలకొరకు ప్రచురిస్తున్నం.

భారత పీడిత రైతాంగ పోరాటానికి తెలంగాణ వేగుచుక్క. ఆ చరిత్ర ఆదర్శాన్ని మనం కాపాడుకోవాలంటే ఆ చరిత్రను మనం కాపాడుకోవాలె. ఆ చరిత్ర గుణపాఠాలు నేర్చుకోవాలంటే మొదట ఆ చరిత్ర పాఠాలు నేర్చుకోవాలె. మాకు పాఠకులద్వారా అందిన పాటల్లో కొన్ని కింద ప్రచురిస్తున్నం తెలుగుదేశం నాలుగు చెరుగులా చెదిరిపోయి గుండెల్లో గూడుకట్టిన యీ పాటలు ఎవరికెన్ని వీలయితే అన్ని సేకరించి అక్టోబరు 10 నాటికి పంపించవలసిందిగా కోరుతున్నం. మొదట అక్టోబర్ 15 నాటికి విప్లవ రచయితల సంఘం తెలంగాణ పోరాట పాటలు ఒక సంపుటం వెలువరిస్తది. అది సమగ్రం కాకపోవచ్చు. ఆ తరాత్వకూడ ఎట్లా అందిన పాటలు అట్లా సృజన సంచికల్లో ప్రచురించబడుతయి. పాటలతోపాటు పోరాటవాస్తవగాధలు, చరిత్రకూడ సేకరించి పంపించవలసిందిగా పాఠకులను కోరుతున్నం.

— సంపాదకుడు.]

# తెలగాణ సింహనాదం

క్రూరనై జామునకు గోరిగట్టగనాడు
నల్గొండ యోధులూ వెల్గించినా జ్యోతి
నల్దిశలు పాకిందిరా
తెలగాణ
సింహనాదము జేసెరా.

పాతకాలమునాటి దోపిడీ రాజ్యాన్ని
పాతి పెట్టాలనే పరమావధినిదీర్చ
ఏకమై నిలిచిందిరా
తెలగాణ
శతృ దండుల తరుమగా—

ప్రజల రక్తముతాగి బలిసి కొవ్వెక్కిన
దోపిడీ గుంపులు పట్నవాసము బట్ట
కళకళాలాడిందిరా
తెలగాణ
శతృశేషము లేకనూ—

చెమటోడ్చి పండించు రైతుకూలీలంత
పోరాడిగెల్చిరీ భూమిపై హక్కునూ
మార్గదర్శకమాయెరా
తెలగాణ
భారతావనికంతకూ—

వెనకకాలాలలో కనివినీ ఎరుగనీ
స్త్రీ పురుషులందరు సంబరముచేయంగ
గ్రామరాజ్యాలనూ
తెలగాణ
తొలిసారి చవిజూచెరా—

నవజీవనంబుతో మందహాసముజేయు
తన గ్రామసీమలను రక్షింపబూనగా
అయుధము చేపట్టెరా
తెలగాణ
మేరుపై నిలచిందిరా—

తరతరంబులనాటి బానిసాము క్తికై
తెలగాణ వనితలు వీరగర్జనచేసి
కదనరంగము కురికిరీ
తెలగాణ
వైరిమూకల దునుమగా—

రజాకార్లు గుండాలు మిలిటరీ దున్నలు
కండ్లకావరముతో గ్రామాలపైబడ
వెన్నంటి తరిమిందిరా
తెలగాణ
శౌర్యపటిమను జూపెనూ—

నాజి నైజాముతో నీచరాజీపడిన
కాంగ్రేసు ధనికుల కపట నాటకమంత
తెలిసికొని లేచిందిరా
తెలగాణ
కాలహరణము చేయకా—

ప్రజల రాజ్యాలను వమ్ముచేయుటకొరకు
కాంగ్రేసు సైన్యాలు దొరల కండగరాగ
కొండయై ఎదిరించెనూ
తెలగాణ
యోధులే ఒరిగారురా—

నైజాం నెహ్రూల సాగనంపేవరకు
అస్త్రసన్యాసంబు ఇలలోన కల్లయని
రణభేరి మ్రోగించెరా
తెలగాణ
విప్లవమని నినదించెనూ—

తెలగాణ వీరుల సమరనాదము పిలుపు
అందుకొని ప్రజలంత భరతదేశములోన
పాగిరండని చెప్పెనూ
తెలగాణ
వేగుచుక్కై వెలసెనూ—

భళి భళి పాట

## వీరుడంటె వీరుడండి!

(అమరవీరుడు కామ్రేడ్ తిరుమలరెడ్డి వీరోచిత పోరాట గాథ)

ఓ తెల్గు ప్రజలార! వీరమాతల్లార!
వీరయువకుని తలువరండీ — భళి! భళి!

వీరుడంటె వీరుడండీ ,,
శూరుడంటె శూరుడండీ ,,
పోరులో పెద్దపులండీ ,,

దోపిడిదార్లకు, దొంగ దేశముఖ్‌లకు
అతనిపేరు వింటే అడలండి ,,

పుట్టాడు తెలుగుదేశమునా ,,
పట్టాడు ఎర్రజెండాను ,,
తరిమికొట్టాడు దేశద్రోహులను ,,

అట్టిల్లుగాదండి ఆ వీరయువకుండు
అంతకులకే సింహ స్వప్నంబు ,,

గబ్బెట తిరుమాలరెడ్డి ,,
వీరసింహము ప్రాణమండి ,,
పోరాడినా వీరుడండి ,,
ఇట్టివీరుని చంపినట్టి ,,

క్రూరులై మనదేశసారాన్ని పీల్చుటకు
దొంగవేషాలతో వచ్చారు భళీ! భళీ!

దేశభక్తుల మన్నవారె ,,
దోపిడి దొంగలైనారు ,,
భరతభూమిని పీల్చినారు ,,
దొంగలంతా బాగుపడ్డారు ,,

అది చాలకను నేడు వీరతెలగాణను
హతముచేయగ బూనినారు ,,

పేరులో పెద్దరికముంది ,,
చేతిలో బూరు బూరుంది ,,
కట్టేది ఖద్దరేనండి ,,
కొట్టేది బీదప్రజలనండి ,,

దారుణ దోపిడిదారులు మేమంత
కాంగ్రెసు వారమంటారు ,,

వల్లబాయిగాని సైన్యము ,,
వచ్చింది దానికి ఫలితము ,,
పల్లెలను కొల్లగొట్టారు ,,
పిల్లలను ఎడబాపినారు ,,

కాంగ్రెసు రౌడీలు — కాశింరజ్వీ గుంపు
గ్రామాలే దోస్తున్నారు ॥ఓతెల్గు ప్రజలార!॥

తెల్గు స్త్రీలను చెరచినారు భళీ! భళీ!
తెల్గుమాతల చంపినారు ,,
చెప్పనోటికి రావుబాబు ,,
చేత కలమాడదండి ,,

తెల్గు తల్లుల తలలు గొరిగించారు
ఇంత కన్న గోరమేముంది ,,

బాలెంతలను చెరచినారు ,,
గర్భవతుల గొట్టినారు ,,

యువతుల జైళ్ళలో గుక్కినారు భళి! భళి!
ఎన్నొహింసలు బెట్టినారు ,,
పల్లెలను తగుల బెట్టారు ,,
గ్రామాలను తగులబెట్టారు ,,
గాంధిగారికి జై అన్నారు ,,
వనితలను భంగపెట్టారు ,,
నెహ్రూగారికి జై అన్నారు ,,

శాంతి సిద్ధాంతమని చేశారు యీపనులు
ప్రజలంత ప్రతిఘటన చెయ్యాలి ,,

కలియుగద్రోహ రాక్షసుడు ,,
విసునూరి దేశముఖుగాడు ,,
జగమెరిగినట్టి రాక్షసుడు ,,
తెలుగుదేశానికి ద్రోహి ,,
తెల్గుతల్లుల చెరిచే పాపి ,,
సంకలో పెట్టుకున్నాడు ,,
జనగామ పల్లెలంతేను ,,
వీరతనుచాటి చూపారు ,,
క్రూరులను రూపుమాపారు ,,

పీనినణచుటకై నెహ్రూ సైన్యము నేడు
విసునూరు వానితో కూడింది ॥ఓ తెల్గు ప్రజలార॥

మిల్టరీని చూచినారు భళి! భళి!
మూర్ఖులను ఎదురుకున్నారు ,,
బూటకము తెలుసుకొన్నారు ,,
తెలగాణదెబ్బ తెలిపారు ,,

ఉరికురికి ప్రజలంతా ఊరి ప్రజలంతా
విజయ ఢంకను కొట్టారు ,,

పగలు పోలీసువాండ్లు ,,
కండ్లులేని వాండ్లు ,,
సముద్రాల చుట్టినారు ,,
ప్రజల చిదగ్గొట్టినారు ,,

మన తెలుగు వీరుడు తిరుమలరెడ్డిని
క్రూరమూకలు పట్టుకున్నారు ।ఓ తెల్గు ప్రజలార॥

బాధలెన్నో పెట్టినారు భళి! భళి!
బయనెట్లతో పొడిచినారు ,,
నాయకుల చూపమన్నారు ,,
నానాహింసలు పెట్టినారు ,,

ఒక్క జవాబైన మన తిరుమలుడు
కుక్కలకు చెప్పలేదండి ,,

ఎన్నెన్నో కొట్టుకోమన్నాడు ,,
ఏమైన చేయమన్నాడు ,,
వీర తెల్గాణలోన ,,
ఎన్నో రోజులుండబోరు ,,

మీ నెహ్రూసైన్యాన్ని ఊసకోతలు కోయ
తెల్గుప్రజల సైన్యమున్నాది ,,

ఈనాడు నన్ను చంపినను ,,
ఎందరో పుట్టుదురు రేపు ,,
ఒక్క నెత్తురుబొట్టులోన ,,
వెయిలు జెన్మమెత్తుతారు ,,

రాక్షసుల మిమ్మలను డొక్కచీల్చెదరు
ఒక్క తెలుగోడున్నగాని ,,

గండుమీసాల దొరగాళ్ళు ,,
గుండాలు మీ కాంగ్రేసు ,,
ముండలవతు కూర్చున్నారు ,,

రండోయి చూతము రయిఫిలివ్వండి
పండబెట్టెద వరగుగాను ॥ఓ తెల్గు ప్రజలార॥

ఆ మాటలకు మిలట్రీవాళ్ళు భళి! భళి!
తెల్లవేశారండి కండ్లూ ,,
తెల్ల మొకములు వేసినారు ,,
తెల్లారగ జూచినారు ,,

దొంగలవలె వారు తెల్గునాయకుని
గుండెకాల్చ సాగినారు                                    భళి! భళి!

ధామ్మన ఫాసిస్టుదెబ్బ                     ,,
తగిలినది కుడిచేయి జెబ్బ                  ,,
పగిలినది తెలుగమ్మ గుండె                 ,,

జై కమ్యూనిస్టు, జై తెలంగాణ అని
జై జైలు పలికినాడు                                    ,,

రయ్యిన రెండవగుండు                       ,,
రాయివలె తగిలింది                          ,,
దూసుకొని పోయెను డొక్కా                 ,,
చేయలేదది యొక లెక్కా                    ,,

మార్క్సు సిద్ధాంతము మారిపోదన్నాడు
మన నాయకులకు జేజేలన్నాడు                          ,,

కొవ్వు ఎక్కిన క్రూర భటులు                ,,
మూడవగుండు పేల్చారు                      ,,
గొంతులోనుండి వెళ్ళింది                    ,,
రక్తము చిమ్మి పారింది                      ,,

గొంతు చూపించాడు మీ గొంతులనుకూడ
కోసెదరు మా గెరిల్లాలన్నాడు                          ,,

నాల్గవ గుండు కాల్చారు                    ,,
పగిలిపోయెను రెడ్డిగుండె                    ,,
అయిదవ గుండు విడిచారు                  ,,
జై తెలంగాణ అన్నాడు                       ,,

చిరునవ్వు మొకముతో జేజేలు కొట్టారు
ఒరిగాడు మనతెల్గు వీరుండు     ॥ఓ తెల్గు ప్రజలార॥

కూలింది మన తెల్గుకోడె              భళి! భళి!
వీరసింహము మనకు లేడండి               ,,

తెల్గాణ ప్రజలంత కంటనీరెట్టారు
నీవంటి నాయకుడు మా తెల్గుదేశాన్కి
కరువయ్యి పోయెనని గొల్లుమన్నారు                    ,,

మార్చి తొమ్మిది దినమునాడు ఛీ! ఛీ!
ఏడ్చింది మన తెలుగు తల్లి ,,
రాల్చింది తన కంటినీరు ,,
తెచ్చింది తెలగాన పోరు ,,
వీచింది పెనుగాలి జోరు ,,

ఫెళఫెళార్భటులతో పెట్టుబడిదారులను
హతమార్చిగాని సాగిపోనన్నాది ,,

మార్చి తొమ్మిదవ తేది ,,
మరువరానీ దినము ,,
పాలకుల ఎదిరించినట్టి ,,
క్రూరులను ఒణికించినట్టి ,,

నరుడు తిరుమలరెడ్డి ప్రాణాలువదలె
అతని ఆశయం మరువకండి ,,

తెల్గు యువకుడ లేచిరారా ,,
దేశద్రోహులనెల్ల ,,
హతమార్చగా లేచిరారా ,,

నీ తెలుగుదేశాన నిత్య కల్యాణముగ
ప్రజారాజ్యమును స్థాపించ రావోయి ,,

ముసలితాతల్లార లెండి ,,
మారు మాటలు చెప్పకండి ,,
దేశాన్ని నిలబెట్టరండి ,,
మోసకారుల తరుమ రండి ,,

అసమాన ధైర్యముతో పశుబలాన్నెదిరించి
కసిదీర్చుకొని పేరునిలపండి ,,

వీరవనితల్లార రండి ,,
వీరమాతను కొల్వరారండి ,,
వీర రుద్రమ లవ్వరండి ,,

ఓ తెల్గు ప్రజలార! వీరమాతల్లార!
వీరయువకుని గలువరండీ ,,

## నాజీ నైజాముం

"బండి వెనుక బండీ
పదహారు బండ్లు కొడుకో
ఏ బండ్లె వస్తవు కొడుకో నైజాము సర్కారోడా
నాజీల మించినౌరా నైజాము సర్కారోడా

పోలీసు మిల్ట్రి రెండు
బలవంతులనుకోని
పల్లెలు దోస్తివి కొడుకో నైజాము సర్కారోడా

జాగీరు దారులంతా
జామీను దారులంతా
నీ యండ జేరిరి కొడుకో నైజాము సర్కారోడా

స్త్రీ పురుషులంత కలిసి
పిల్లాల మంత కలిసి
వడిసేల రాళ్ళ నింపి
వడి వడిగ గొట్టితేను
కారాపు నీళ్ళు దెచ్చి
కండ్లల్ల జల్లితేను
నీ మిల్ట్రి బారిపోయెరో నైజాము సర్కారోడా

చుట్టు ముట్టు సూర్యాపేట
నట్టనడుమ నల్లగొండ
నీవుండే హైదాద్రబాదు
దాని పడమట గోలుకొండ
గోల్కొండ ఖిల్లాకింద
నీ గోరి కడుతం కొడుకో నైజాము సర్కారోడా!

# రైతు కూలీల పాట !

రైతుకూలీ లేకమైతే కూటికి తరుగేమిరా
కూలిరైతులలోన బలిమీ కాలమంమనముండెరా!

కూలి రైతులైన మనకు
కులములెందుకు తెల్పరా !
రైతుకూలీలైన మనము
కలిసి ఉందము సోదరా !
ఎండ వానలకోర్చి మనము
కండలు కరిగించియు
దండిగా రకరకములైన
ధాన్యములు పండిస్తిమి
పండినా పంటంత
సోమరిపోతులకు చెల్లిస్తిమి
తిండిలేకను చెట్టు గుట్టలు
తిరుగుచూ మనముంటిమి
కష్టపడి ఈ మేడలన్నీ
కట్టినది మనమేకదా
కష్టపడి ఈ ఫ్యాక్టరీలు
కట్టి వారలకిస్తిమీ
కష్టజీవులమైన మనకు
గుడిసెలే గతి ఆయెరా
కష్టపడి పనిచేయుచున్నను
కడుపు నిండుట లేదురా
ధనము ధాన్యము తరుగనంత
దేశమునందుండెరా

తినుట కున్నప్పటికీ
దానికి దూరమై పోయామురా
ధనికులే ఈ సంపదంతయు
అనుభవించుట ఏలరా
తినుటకన్నములేని వారికి
దానిపై హక్కుందిరా
సమతా స్వతంత్రరాజ్యము
స్థాపనము చేయాలిరా

రైతుకూలీ లేకమైతే కూటికి తరుగేమిరా
కూలి రైతులలోన బలమీకాలమందున నుండెరా!

## పీడిత ప్రజలంతా లేవండోయ్!

పీడిత ప్రజలంత లేవండోయ్
పౌరుషంబున పోరు సల్పండోయ్

మాయ మాటలు చెప్పి మోసగించియు నేడు
గద్దెలెక్కియు నేడు కాంగ్రేసు పాలకులు
టాట బిర్లాల కండజేరారోయి
తగని ప్లానులు వేయు చున్నారోయి ॥పీడిత॥

బానిసత్వము పెట్టిచాకిరీ నంతటిని
బాపుకొనుటకు ప్రజలు నడుము బిగియించగా
రైఫిళ్ళతో రంగమెక్కారోయ్
రామరాజ్యం బిడెనంటారోయ్ ॥పీడిత॥

కలకత్త బొంబాయి మలబారు మద్రాసు
కార్మికుల రక్తాలు చింది కాల్వలు పార
పిచ్చి పిచ్చిగ కాల్చి వేశారోయ్
ఫాసిస్టులను మించి పోయారోయ్ ॥పీడిత॥

విద్యార్థి యువజనులు వీరవనితలు కలసి
వాక్స్వాతంత్ర్య పౌరసత్వాలడుగ
బడితెలతో క్రూరముగ బాదారోయి
బాష్పవాయువు బాంబు లేశారోయి ॥పీడిత॥

శాంతి రక్షణ యంచు కనపడ్డవారిని
శాంతి భక్షణ యని జైళ్ళలో కుక్కగా
తల్లి పిల్లలు తల్లడిల్లారోయి
తప్పు జూపుమంటే తన్నారోయి ॥పీడిత॥

భర్తలను బంధించ భార్యాపిల్లాలంత
ఇది ఏమి న్యాయమని ప్రజలంత అడుగగా
ప్రాణాలు వీధుల్లో తీశారోయి
పిల్ల లేడ్వగ తల్లులొరిగారోయి ॥పీడిత॥

సామ్రాజ్యవాదుల తొత్తులై నేడు
మిత్రరాజ్యసమితి వివిధ సంఘాలలో
యుద్ధకూటమి కండ జేరారోయి
శాంతి కిప్పుడె ముప్పు దెచ్చారోయి ॥పీడిత॥

ప్రజాస్వామిక బాట వదలి కామన్వెల్తు
పాలకులతో చేరి బర్మా మలయా ప్రజల
పోరునాపగ సాయపడినారోయి
ఫాసిస్టులా కండ జేరారోయి ॥పీడిత॥

కోట్ల కొలది డబ్బు సహాయమిచ్చి నేడు
కాపాడె జాగీరు దొంగ దొరలందరిని
తన పాలనలో కల్పు కొన్నారోయి
తగిన స్థానాలిచ్చు చున్నారోయి　　॥పీడిత॥

దేశ బడ్జెట్టులో ఇబ్బడికి ముబ్బడిగ
హెచ్చించి మిలటరీ ఖర్చులన్నింట్ని
సేనలెన్నో పెంచు చున్నారోయి
సత్యాహింసల పాలనంటారోయి　　॥పీడిత॥

నీటి వనరులు విద్య వైద్యానికెప్పుడో
నీళ్ళు నువ్వులు వదిలి నిల్పివేసియు నేడు
పాతబాటనె ద్రొక్కుచున్నారోయి
ప్రజలమేలుకు సున్న జుట్టారోయి　　॥పీడిత॥

నిరుద్యోగులై నేడు లక్షలాది ప్రజలంత
నిల్వనీడా లేక అలమటించుచునుండ
స్వాతంత్ర్యమని పిలుచు చున్నారోయి
గాంధీజమని కులుకు చున్నారోయి　　॥పీడిత॥

సేలమూ కడలూరు డమ్‌డమ్ నాసికు
నిలువునా జైళ్ళల్లో గుండ్లెన్నో వరసగా
నిరాయుధులపైకి పేల్చారోయి
నిరపరాధుల పట్టి చంపారోయి　　॥పీడిత॥

భారతావనికంత బాట జూపిన యట్టి
తెలుగు వీరులబట్టి తల్లక్రిందులు జేసి
చెట్టు కిరిసికట్టి కొట్టారోయి
చేతుల్లో సీలలునాటారోయి　　॥పీడిత॥

ఆసనాలల్లోను మేకులు దిగగొట్టి
ప్రాణాలు గిలగిలా లాడుచూ నుండగా
మంటల్లో వేసి మాడ్చారోయి
మరి ఎందరినో చువ్వలతో కాల్చారోయి ॥పీడిత॥

భారత పీడిత ప్రజలు పౌరుషంబుగలేచి
పట్టువిడువక నేడు పోరు సల్పుతుంటె
పల్లెలెన్నో పీకి వేశారోయి
పరమ దుర్మార్గాలెన్నో చేశారోయి ॥పీడిత॥

నరక కూపము జేసి దేశపాలననంత
మరతుపాకులతోను పాలించుచున్నారు
నాజి హిట్లరు పాలనా మించిందోయి
మోసాన్ని గుర్తించి లేవండోయి ॥పీడిత॥

ప్రాచ్య యూరపు రష్య చైనా దేశాలలో
ప్రజల పాలన కొరకు సాయుధంబుగ పోరి
యమకింకరుల సాగనంపారోయి
తామె పాలనము చేత పట్టారోయి ॥పీడిత॥

మధ్యయుగపునాటి బానిసత్వము బాపి
భూతల స్వర్గాన్ని నిర్మించుకున్నారు
బాట ఇదియె మనకు లేవండోయి
పౌరుషంబుగ పోరు సల్పండోయి
పీడిత ప్రజలంత లేవండోయ్
పౌరుషంబున పోరు సల్పండోయ్ ।

నవల :

# నా కుటుంబం

టావ్ చెంగ్

(గత సంచిక తరువాయి)

"అదేం కాదమ్మా, వ్రాస్తానని వాగ్దానం చేశాను. వ్రాయకుంటే మోసగించి నట్లు అవుతుంది."

ఒప్పుకోక తప్పింది కాదు. ఉత్తరం ముగించి సిమెంటునేలమీద పరచిఉన్న చాపను (అదే పడక) చుట్టేవాడు. చలికాలమంతా అక్కడే పడుకున్నాడు. ఆరోగ్యం బాగాలేదుకదా అని ఇంకెవరి పడకైనా వాడుకొమ్మని సూచిస్తే మొండిగా నిరాక రించేవాడు.

"నేనింటికి పెద్దకొడుకునా కానా" అంటూ వాదన మొదలు. ఇంతకంటే ఎక్కువ జవాబు చెప్పే అవసరంలేదని వాడి ఊహ. తన తమ్ముడూ, చెల్లెళ్లకు అసౌకర్యం కలగకూడదని వాడి కోరిక.

కొద్ది రోజుల్లోనే వేసవి ప్రవేశించింది.

ఒకనాడు చాంగ్ మాయింటికి వచ్చి "ఒక పనిఉంది చేస్తావా?" అన్నాడు ఏదో వింతగా.

"ఆ.... పార్టీ కొరకైతే" అని నా సమాధానం.

"ఒక విధంగా పార్టీ పని అన్నట్లే." ఒక క్షణమాలోచించి, డొంకతిరుగు డెందుకు. జిల్లా పార్టీ సమితి కార్యదర్శి భార్య చనిపోయింది. ఆమె ఇద్దరి పిల్లల రక్షణ భారం వహించాలి. నువ్వోరెండు రోజులు చూస్తావా?"

"నేను దానికే అవసరమైతే ఎందుకు చేయను?"

"నువ్విష్టపడవనుకున్నాను, నీ కుటుంబమే ఎంతో పెద్దదాయె, పైగా ఇదొక పనిమనిషి పని...." అన్నాడు.

ఎంత నీచమైన భావం! నేనతని మాటలకడ్డుపడ్డాను.

"ఎంత మురికి భావాలు నీవి. ఒక పనిమనిషి ఒక విప్లవకారునికి ఇంటి పనుల్లో సహాయపడితే తప్పేమిటి? నేనతడి పిల్లలను చూసుకుంటే అతడు తనపనిలో మనసు పూర్తిగా లగ్నంచేయవచ్చు. అదీ విప్లవానికే దోహదం చేసినట్లవుతుంది కదా. అవునా కాదా?" అని ప్రశ్నించాను.

నా జవాబు అతణ్ణి నిరుత్తరుణ్ణి చేసింది.

"సరే, నీవే గెలిచావు. నీవు మాట్లాడుతుంటే ఏదో ఒక ముఖ్య విషయం మరచిపోతాను. పార్టీ తన స్వంత ముద్రణాలయం పెట్టాలనుకుంటూంది. అందులో నీ రెండవ కొడుకు యింగ్-చీన్ కంపోజింగ్ నేర్చుకోవాలని కూడా అభిప్రాయపడుతూ ఉంది. ఒకవేళ నీకేమీ అభ్యంతరం లేకపోతే ఇప్పుడే నాతో తీసుకుపోతాను."

"నాకభ్యంతరం ఉంటే యేం?"

నేను మళ్లీ ఏదో వాదన పెట్టుకుంటా ననుకున్నట్లున్నాడు, అందుకే వెంటనే తన ఉద్దేశం వివరించాడు. వాస్తవానికి నాకు వాదన పెట్టుకుందామనే ఉద్దేశమేలేదు. అతడు అస్తమానం 'ఒకవేళ' అంటూ డొంకతిరుగుడుగా చెప్తుంటేనే కోపం వచ్చింది.

"విప్లవానికి అబ్బాయి అవసరం కనుక తీసుకుపో. నేను విప్లవానికి చెందిన దాన్ని, అలాగే నా పిల్లలు." అన్నాను.

విప్లవం ఇంతటి క్లిష్టదశలో ఉన్నప్పుడు నా శక్తి మేరకు పనిచేయడానికి అవకాశం ఇవ్వడం నాకు భాషకందని ఆనందం కలిగించింది.

సాయంకాలం, షాంఘై వేసవి ఆనవాయితీ ప్రకారం చిన్న ముసురు కురిసి వెలిసింది. ఒక గౌను తొడుక్కున్న మనిషి మా ఇంట్లోకి ప్రవేశించాడు. ఇద్దరు చిన్న పిల్లల్ని చెరొక చంకలో ఇరికించుకొని వచ్చాడు. తీరాచూస్తే షాంఘై జిల్లా పార్టీ సమితి కార్యదర్శి హో మెంగ్-హ్సియంగ్.

"క్షమించాలి నీకు శ్రమ కలిగిస్తున్నాను." ఎంతో మర్యాదగా అన్నాడు, పిల్లల్ని పడుకోబెడ్తూ.

"అట్లా అనకు, మనం కామేడ్లం కదా. నేనిక్కడికి వచ్చినప్పటి నుండి పార్టీ పనుల్లో పాల్గొనాలని ఎదురుచూస్తున్నాను. నాకు ఏదో పెద్ద చేయగల సామర్థ్యం లేకపోయినా చిత్తశుద్ధి ఉంది."

"కామ్రేడ్ లింగ్‌తా-తావో నిన్ను గురించి చాల చెప్పాడు. నీవు షాంఘైకొస్తావని ఊహించలేదు ఇంతమంది పిల్లలుండి కూడా పార్టీనే అనుసరిస్తూ ఎన్నో కష్టాలు పడ్డావు."

అతడి పిల్లలను గురించీ తరువాత కామేడ్ లింగ్‌తా-తావొను గురించీ అడిగాను. అతడు పొడిగా "క్షేమమే" అన్నాడు. నాకవసరంలేని విషయాల్లో తలదూర్చ కూడదని అప్పుడర్థమైంది. ఇది అజ్ఞాత జీవిత క్రమశిక్షణ (Underground discipline). అందుకే కామేడ్ లింగ్‌ను గురించి ఇంకేమీ అడుగలేదు.

మేము మాట్లాడుతూండగానే పెద్దగా ఉరిమింది. దానితో కిటికీ అద్దాలు అదిరి పోయాయి. అప్పుడే లియాన్ పూర్తిగా తడిసి లోపలికురికొచ్చాడు. బాగా నీరు కారుతూంది. నేలంతా తడుపుతున్నాడు.

"అమ్మా, ఉద్యోగం వదిలిపెట్టానే." అంటూ పెద్దగా అన్నాడు. ప్రక్కకు తిరిగేసరికి కామ్రేడ్ హో కనిపించాడు. "నువ్వు చెప్పకున్నా, నువ్వెవరో నాకు తెలుసు" అన్నాడు కొంటెగా.

కామ్రేడ్ హోకు ఆనందం కలిగింది. "అద్భుతం! మీ లియాన్ ముఖంచూసే పేరు చెప్పగలడే!" అని అన్నాడు నాతో.

"నా పేరు నీకెట్లా తెలుసు?" అని ఆశ్చర్యంగా అన్నాడు.

"ఎంత మతిమరపు నీకు! చాలాకాలం క్రితం 'తాకియాంగ్ దినపత్రిక' నాకిచ్చావు- జ్ఞాపకం లేదా?"

"అసంభవం. నేను ఒక్కసారి చూసిన మనిషిని, చచ్చిబూడిదైనా గుర్తించ గలను." నీళ్ల తుడుచుకుంటూ అన్నాడు "బహుశ అమ్మ చెప్పి ఉంటుంది."

నేనూ అయోమయంలో పడ్డాను. అయితే లి-యాన్‌ను కామ్రేడ్ లుంగ్ చూసి, మా కుటుంబం గురించి హోకు చెప్పి ఉంటాడా? నాకు ఈ విషయం నిర్ధారణైపోయింది. కాని పిల్లవాడు కామ్రేడ్ హోను ప్రశ్నలతో ఇంకా వేధిస్తూనే ఉన్నాడు. "అరేయ్, పోయి బట్టలు మార్చుకోపో, నేలంతా తడుపుతున్నావు. రాత్రికి ఎక్కడ వేస్తావు పడక?" అన్నాను.

అబ్బాయి చొక్కా విడిచి పిండి వరండాలో ఆరవేశాను. ఒంటిమీద నిక్కర్ మాత్రమే ఉంది లోపలికివచ్చి మళ్లీ కామ్రేడ్ హోను వేపుకుతినసాగాడు. జవాబు రాబట్టేవరకూ, నిజం కక్కించేంతవరకు వాడూరుకోడు.

"నీవసలు మిల్లు ఉద్యోగం ఎందుకు వదిలి వచ్చావో చెప్పుమొదలు." కామ్రేడ్ హో మెంగ్-హ్సియంగ్ పిల్లవాడిని మరపించడానికి ప్రయత్నించాడు.

"అదొక నరకం!" కోపంగా అన్నాడు లి-యాన్. "రోజూ ఏదో ఒక కొత్త ఎత్తు ఎత్తి కార్మికులచేత ఎక్కువ పని చేయించడానికి ప్రయత్నిస్తారు మేనేజిమెంటు వాళ్లు. కార్మికులకు విశ్రాంతి యివ్వరు దేనిక్కూడా. మెకానిక్కుల్లో ఒకడందుకే చచ్చాడు కూడా."

"అయితే నీవందుకే ఉద్యోగం వదిలావా?"

"అహఁ! అదేమీకాదు. ఆ మనిషి నేను మిల్లులో చేరకముందే చనిపోయాడు."

లి-యాన్ ఒకసారి మాట్లాట్టం మొదలుపెట్టాడంటే ఆగడు. "ఈ ఉదయం నేను అన్నం తింటుంటే ఫోర్మన్ ఒక డబ్బీ సిగరెట్లు తెమ్మన్నాడు. 'అన్నం తినేంత వరకాగు' అన్నాను. దాంతో వాడు మండిపడ్డాడు. రంకె వేశాడు. 'ఇంత ధైర్య మెక్కడిది నీకు, నన్ను ధిక్కరించడానికి నీకెన్ని గుండెలురా!' అన్నాడు 'నాకాకలౌ తూంది, అన్నం తినాలి. నువ్వు నన్నాపలేవు- నేనేమీ నీ గులామును కాదు,' ఫోర్మన్ బుసకొట్టాడు. 'కుక్క, నాతో వాదించడానికి నీకెన్ని గుండెలురా! 40 సెంట్లు జుర్మానా వేస్తున్నాను' అన్నాడు. 'తక్కువే కదూ, కాని అది నారోజు కూలికంటె ఎక్కువే' ఆ దుర్మార్గుడు 'సరే, అయితే నువ్వు నాకు వ్యతిరేకంగా మాట్లాడే ప్రతి శబ్దానికీ 40 సెంట్లు చేస్తున్నాను' అన్నాడు. 'అయితే నా పేర డబ్బు మూటగట్టాలనుకుంటున్నావా? నీ యిష్టమొచ్చినంత జుర్మానా వేసుకో, నేనైతే ఉద్యోగం వదిలిపోతున్నాను- అన్నాను' అన్నాడు.

మాటల్లో ఫోర్మన్‌ను అనుకరిస్తున్నాడు లి-యాన్. కామ్రేడ్ హో చిన్నగా మాట్లాడమనీ, లేకపోతే ఎవరైనా వింటారనీ ఒకటికి రెండుసార్లు హెచ్చరించాడువాణ్ణి. వాడు నెమ్మదిగా మాట్లాడ ప్రియత్నించినా ఆవేశంలో తెలియకుండానే స్వరం హెచ్చించాడు.

"నీవు వార్తాహరునివి కావు, నటుడివి" అన్నాడు కామ్రేడ్ హో. "అయినా నీవు చేసిందే బాగుంది. వాళ్లకు బుద్ధిచెప్పాలి"

"ఇంజినీర్ వాంగ్‌కు చెప్పావా ఈ విషయం?" అతడికి సంజాయిషీ చెప్పుకో వలసి ఉన్నట్లుగా అడిగాను లి-యాన్‌ను.

"ఆ, చెప్పాను. నా మూర్ఖతకు నిందించి వెళ్లి క్షమాపణ కోరుకొమ్మన్నాడు. 'ఈ ముసలివాణ్ణి గురించి ఒక జంతువులాగా పనిచేయాలా!' అన్నాడు. న్యాయం వాని పక్షాన్నే ఉందని వాడి నమ్మకం.

"సరే నీవేమీ పోవద్దులే" అన్నాడు కామ్రేడ్ హో. "నీవలా చేస్తే రాజీపడ్డ ట్లవుతుంది, అంటే అపజయం పొందినట్లు."

బయట ఇంకా వర్షం కురుస్తూనేఉంది. బజార్లన్నీ కాలువలుగట్టి వరదలుగా పారుతున్నాయి. రాత్రికి ఇక్కడే ఉండి పొమ్మన్నాం కామ్రేడ్ హోను. పైగా కొత్తచోటు కనుక అతడి పిల్లలు మచ్చికకాకపోతే తండ్రి ఉన్నట్లూ ఉంటుంది. అతడు ఒప్పుకోవడంతో లి-యాన్ సంతోషంగా ఎగిరి గంతేశాడు. తనతోపాటు పడుకో మన్నాడు. లి-యాన్ నేలమీద పక్కపరుస్తూంటే కామ్రేడ్ హో నాచెవిలో నెమ్మ

దిగా అన్నాడు. "నీకు దయలేదనే అనాలి, లి-యాన్‌లాంటి కొడుకుండి కూడా అతన్ని పార్టీపరం చేయలేదే !"

"ఏమిటీ ? వాణ్ణి నీతో తీసుకుపోగలననేనా నువ్వనేది ?" ఆనందమూ, ఆశ్చర్యమూ ముప్పిరిగొన్నాయి.

"అవును, రేపే చేస్తానాపని." హాస్యంగా అన్నాడు "ఒకవేళ నువ్వు ఒప్పుకోకపోతే ఎత్తుకుపోతాను. మంచి యోధుడౌతాడు."

"అద్భుతం, నా కొడుకెప్పుడూ పార్టీవాడే."

లి-యాన్ మౌనంగా ఉన్నాడు. నేల ఇంకా తడిగా ఉంది. పాత కంబళిబొంత కింద పరచాడు. మేనువాల్చిన తరువాత ఎంతో ముచ్చట్లతోనే కాలం గడిపారు.

మొదట చూడగానే కామేడ్ హో నెమ్మదస్తుడు, గంభీర వ్యక్తిగానూ అనిపించాడు. అతడు అంత నిర్మొగమాటంగా, దయగా స్థయిర్యంగా ఉంటాడనుకోలేదు. నేను కునికిపాట్లుపడుతున్నా వాళ్లిద్దరూ వుహాన్‌లోఉన్న రోజుల పరిస్థితులను గురించి చర్చించుకోవడం వినిపిస్తూనే ఉంది. అకస్మాత్తుగా లి-యాన్ సంతోషంతో ఏదో కని పెట్టినట్లు అరిచాడు, "ఆఁ.... ఇప్పుడు తెలిసింది. నీవు నన్నెప్పుడూ చూడలేదు. నన్ను గురించి నీకు లుంగ్‌మామే చెప్పాడు."

"మొత్తానికి చురుకైనవాడివే. నన్ను బాగా ఆకట్టుకున్నావు" నవ్వుతూ అన్నాడు హో. "సరేకాని పెద్దగా మాట్లాడకు, పోలీసులింకా గస్తీ తిరుగుతూనే ఉన్నారు బయట."

ఇంకా ఈ దాగుడుమూతలు ఆడుతూనే ఉన్నారు.

## 12

కొద్దిరోజుల్లోనే కామేడ్ హో మెంగ్-హ్స్యాంగ్ తన యిద్దరు పిల్లల్ని తన అన్న ఇంటికి పంపాడు– "నీవు పార్టీ కొరకు ఇంకా ఎక్కువ పనిచేయవచ్చు. స్వార్థంతో నా పిల్లల రక్షణ భారం నీ కప్పగించడం ఏం బాగుంటుంది !" అన్నాడు.

నేను జిల్లా ట్రేడ్‌యూనియన్ కార్యాలయానికి, ఆ తరువాత ఒక నెలకు చైనీస్ కమ్యూనిస్ట్ యూత్ లీగ్ కేంద్రసమితి కార్యదర్శిత్వ శాఖకు మార్చబడ్డాను. ఆ సంవత్సరమే చైనీస్ కమ్యూనిస్టు పార్టీలో చేర్చుకున్నారు.

కార్యదర్శిత్వశాఖ షూ'ఇలీలో ఆ రోజుల్లో అంతర్జాతీయ ఆవాసంగా చెప్పుకునే కార్టర్ రోడ్‌లో ఉంది. చిన్నపిల్లలు చి-హో, షువాంగ్‌లిన్‌లను తీసుకొని కొత్త

యింట్లో ప్రవేశించాను. అది చిన్నగా ఉన్నా, విదేశీ నమూనాలో ఉన్న అందమైన రెండంతస్తుల మేడ. నేనూ నా పిల్లలు తప్ప అక్కడ ఎవరూ లేరు. రహస్య పత్రాలను దాయడం పైవారి కందజేయడం, ఎప్పుడైనా మీటింగులు జరిగితే కాపలాకాయడం నా పని. కామ్రేడ్ పోకు, కామ్రేడ్ వాంగ్‌మింగ్ లాంటి ప్రముఖ కాడర్లుకూడా పనిచేయడానికి వచ్చేవారక్కడికి. పగలల్లా రాసుకుంటూ ఎవరికంటా పడకుండా పై అంతస్తు గదిలో ఉండేవాళ్లు. అన్నం వండి వారికొరకెదురుచూసేదాన్ని.

ఆరోజుల్లో అంతర్జాతీయావాసాన్నిగానీ, అక్కడి వాసులనుగానీ తనిఖీ చేసే వారుకాదు. ఇల్లు కిరాయకు ఇవ్వడానికి దుకాణం పూచీచూపే అవసరంలేకుండేది. డబ్బే సర్వం. అద్దె సరిగా ఇస్తున్నంత కాలం ఇంట్లో ఎవరుంటున్నారన్న విషయం పట్టేదిగాదు ఇంటి యజమానికి. రోజుకు పది దోపిడీలు అయ్యేవి. హోటళ్లలో చాల గదులు ఎత్తుకొచ్చిన పిల్లలను దాయడానికి వాడుకునేవాడని లోకమంతటికీ తెలిసిన రహస్యం. ఆయుధాలెత్తుకరావడం, దొంగతనంగా దిగుమతి చేయడం చట్టబద్ధమైన పనులైపోయాయి. అధికారం కోల్పోయిన రాజకీయవేత్తలు, యుద్ధఘతులు పోషకులను వదిలిన వేశ్యలు (1911 విప్లవానంతరం రిపబ్లిక్ ఆఫ్ చైనా అవతరించడంతో వీరి సంఖ్య లక్షలకు పెరిగింది) షాంఘైని ఒక అపరస్వర్గంగా చేశారు. విభిన్న వర్గాల ప్రజలు ఈ మిశ్రిత సాంప్రదాయి నగరానికి వచ్చేవారు. ఒక్క వాడలోనే పది నల్లమందు దుకాణాలు, రెండు సుఖవ్యాధి ఆసుపత్రిలు, ఐదు తాకట్టుపెట్టుకొనే దుకాణాలు, ఎన్నో సారా దుకాణాలు, విశ్రాంతి గృహాలు, జూద గృహాలు ఉన్నాయి. దాదాపు ప్రతి సందులోనూ అప్రతిష్ఠతెచ్చే వేశ్యాగృహాలు, జూదగృహాలు, నల్లమందు దుకాణాలు ఉన్నాయి. వీళ్లందరూ పరాన్నభుక్కుల తొత్తులని ప్రత్యేకించి చెప్ప నవసరంలేదు. సామ్రాజ్యవాద కోమింటాంగ్ పరిపాలనలో షాంఘై పొందిన 'ప్రగతి' యిది. ఇలాంటి చోట మేము మా కార్యక్రమాన్ని సాగించవలసివచ్చింది.

మా అజ్ఞాత జీవిత క్రమశిక్షణ ప్రకారం నా ముగ్గురు పెద్దపిల్లలు నావద్దకు వచ్చే వీలులేదు, నేను వారిని చూడడానికి వెళ్లవచ్చు. లి-యాన్ కామ్రేడ్ హోతో జిల్లా పార్టీ సమితి కార్యాలయంలోను, యింగ్-చీన్ ప్రింటింగ్ ప్రెస్‌లోను ఉంటున్నారు. వాళ్లను గురించి బెంగపడవలసిందేమీలేదు. నా బెంగంతా నా కూతురు పెన్-పెన్‌ను గురించే. అది నూలుమిల్లులో ఉన్నది. బలం ఉన్నది కాదు. ఎప్పుడేం జరుగుతుందో ఎవరికెరుక? కాని ఒకరికొకరు కలుసుకునే అవకాశాలు ఎక్కువ. లి-యాన్ వారిద్దరికీ ఎప్పుడూ ఏదో ఒక పని పురమాయిస్తుండేవాడు. చెల్లెలు ధైర్యముగా ఉండలేదేమోననే భయంతో ఆమెకు వాళ్ల మిల్లులోనే పనిచేసే ఒక యువతిని

సంరక్షకురాలిగా (Chaperon) చూసి పెట్టాడు ఆమె పేరు చుకాన్-మెయి. ఆమె కమ్యూనిస్టు యూత్‌లీగ్ సభ్యురాలు. పెన్-వెన్ ఆమెతోనే ఉండి ఎక్కువ కాలం ఆమెతోనే గడిపేది. లియూ అనే వార్తాహరుడు నాకిదంతా చెప్పినపుడు ఎంతో కరిగి పోయాను. చెల్లె అంటే అన్నకు ఎంత ప్రేమ!

"నేనిక్కడ కాపలా ఉంటాను గాని, వాళ్లను చూసిరాపో!" అన్నాడు లియూ. నేను వాళ్లను చూసి కూడా ఎంతో కాలమైంది.

చుకాన్-మెయి ఇల్లు సులభంగానే కనుక్కున్నాను. ఆమె మిల్లుకు పోయింది. తల్లి ఇంటిదగ్గరే ఉంది. పెన్-వెన్ అన్నపానీయాలతో పాటు నివాసమూ ఇక్కడే. చు తల్లి బట్టలు ఉతకడం, కుట్టడంచేసేది. పెన్-వెన్‌ను తన సొంతబిడ్డలా చూసుకునేది

"పిల్లలు చేయిదాటిపోతున్నారు, నా మాట వినేట్టులేరు" అన్నది తల్లి.

పెన్-వెన్‌కు రాత్రి షిఫ్టు కావడం వల్ల బాగా నిద్రపోయింది. నా ధ్వనికి మేల్కొని నా దగ్గరికి ఉరికివచ్చింది.

'అమ్మా, నువ్వొచ్చావా' అంటూ మళ్ళీ మళ్ళీ ఒక పిట్ట మాదిరిగా పునశ్చరణ చేసింది.

"నిన్ను చూట్టానికి వచ్చానమ్మా!" గుండెకు హత్తుకొని అన్నాను. "బాగా పెరిగావు, లావుకూడా ఎక్కావు. కాని పాపం చూ తల్లే మీ పోషణభారంతోనే చిక్కి ఉండాలి."

"చాల దయగలది కదూ. నాకిక్కడికి వచ్చిననాటి నుండి వేడి అన్నమే ..."

చూ తల్లి మేము మాట్లాడుకోవడానికి అవకాశం కల్పించాలని, ఏదో సాకుతో బయటికి జారుకుంది.

పెన్-వెన్ ఎడమ కంటికింది నల్లని మచ్చ ఒకటి నా దృష్టి నాకర్షించింది.

"అదేమిటి, పోట్లాడావా? ఇంకా ఇదివరకు మాదిరే నాజూకా?"

తల అడ్డంగా తిప్పింది. "కాదు. ఫోర్మన్ కొట్టాడు."

దెబ్బలు తినడం బాల కార్మికులకు మామూలే. మొదట్లో ఎవరైనా సానుభూతి చూపుతే పెన్-వెన్ ఏడ్చేది. ఇంకా అలాగే ఉందేమోనని ఏమీ అనలేకపోయాను. కాని అలాంటిదేమీలేక నిర్లక్ష్యంగా ఉండటం నాకాశ్చర్యం గొల్పింది.

"మేమేదో బెదిరినట్లు! వాడికిష్టమైతే కొట్టమను!" అని ఎంతో తిరస్కారంగా అంది. "అణచమను! హుం!.... ఇటువంటివాళ్ల కెట్లాబుద్ధిచెప్పాలో మాకు తెలుసు. యంత్రాల వేగం తగ్గించి, జాపానీయులు వచ్చినప్పుడు పనిచేస్తున్నట్లు నటించడం,

ఆటు మళ్లగానే పూర్తిగా ఆపటం; నిద్రిపోవటం, ఇష్టమొచ్చినప్పుడు బయటికెళ్లడం. మమ్మల్ని కొట్టడానికి ఫోర్మన్ వెంటపడతాడుగా, ఒకణ్ణి పట్టుకోగానే మరొకడు పారిపోవడం. ఎట్లా అదుపులో పెడ్తాడో పెట్టమను! ఈసారి కొట్టాడా, వాణ్ణి 'పైతిలావొ' (Paituilao) చేస్తాం"

'పైతిలావొ' చేయడమంటే ఒక తుంగబుట్టలో పేడతీసుకొని నెత్తిమీదపోయడమన్నమాట. ఫోర్మన్లను శిక్షించే విధానమిదే. తరువాత బహు తగ్గుస్వరంలో "ప్రచార కరపత్రాలు పంచేపని నాకప్పజెప్పాడు లి-యాన్. నీకు తెలుసా, అమ్మా!" అన్నది.

"నిజంగానా?" వింటున్నకొద్దీ మనసు పరవశించిపోతుంది. నా బిడ్డ ఇదివరకటిలాగా సున్నితంగా ఉండకపోవడం ఎంతో ఆనందాన్నిచ్చింది

"అవునమ్మా. నీకు నమ్మకం కలగకపోతే అన్ననడుగింకా. ఎన్నోసార్లు అందజేశాను. ఒకసారి ఫోర్మన్ సంచిలోకూడా ఒకటి కుక్కాను."

"సొంతడబ్బా వాయిస్తున్నావు మళ్లీ" బయట ఎవరిదో గొంతు. వెంటనే అది లి-యాన్ గొంతని గుర్తుపట్టాను.

"లి-యాన్! అమ్మవచ్చింది." చెంగున గెంతి ఎదురెళ్లింది.

యింగ్-చీన్ వాడి వెనకే ఉన్నాడు. తన ఎప్పటి ధోరణిలో లి-యాన్ నామెడ చుట్టూ చేతులేసి నేను పడిపోతానా అనిపించేంత వరకూ కౌగలించుకున్నాడు. యింగ్-చీన్ మాత్రిం ఎవరిమీదనో విసుక్కుంటున్నట్లు, గంభీరంగా ఉన్నాడు.

"వాడితో పోట్లాడావా?" అని లి-యాన్‌ను అడిగాను. లి-యాన్ తత్తరంగా నవ్వాడే కానీ జవాబు చెప్పలేదు. యింగ్-చీన్‌ను అడిగాను.

"అన్న ఒక సాదా బట్టల మనిషిని హేళన చేశాడు- నేను వద్దన్నా వినలేదు." అని నెమ్మదిగా అన్నాడు అసలు విషయమేమిటో స్పష్టంగా చెప్పకుండానే.

అసలు సంగతి. నౌన్యాంగ్ బ్రిదర్స్ టొబాకో కంపెనీవారి పూతుంగ్ బ్రాంచ్ ఫ్యాక్టరీని మూసివేసి వేలాది పనివాళ్లను బజార్లపాలు చేశారు. పనివాళ్లంతా కలసి సుమారు ఒక వందమంది సాంఘిక సమాచార కేంద్రానికి (Social Affairs Bureau) తమకుగల పనిచేసే హక్కుని గురించి మనవి చేయడానికి రాయబారం పంపారు. కాని లాభంలేకపోయింది. తత్ఫలితంగా పనివాళ్లంతా సమ్మెచేశారు. ఆరోజు మూడు నాలుగు వందల మంది ఒక బహిరంగసభ జరిపారు. లి-యాన్ యింగ్-చీన్‌ను "లోకం పోకడ" చూపడానికి తనవెంట తీసుకెళ్లాడు. వాళ్లు వెళ్లేసరికి వేదికమీద ఒక

స్త్రీ మాట్లాడుతూంది. కాని ఆమె ముగించకముందే ఒక సాదాబట్టల మనిషి వేదిక మీదికి గెంతి ఆమెను ప్రక్కకు లాగివేశాడు.

"ఈ సభ చట్టవిరుద్ధం. మొదట మీరు కోమింటాంగ్ నగర సమితి నుండి అనుమతి పొందవలసింది"అని అరిచాడు.

కార్మికులకేమిచేయడానికీ తోచక పోవడానికి ఉద్యుక్తులయ్యారు. అప్పుడు లి-యాన్ పెద్దగా "వాడి మాటలకు మోసపోకండి! శ్రామికులు తమ సమస్యలు చర్చించుకోవడానికి సమావేశాలు జరుపుకోవడం పూర్తిగా చట్టసమ్మతమే. వీడు మన సమ్మెను విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తున్నాడు, తన్ని తరమండి!"అరిచాడు.

ఆ సాదాబట్టల మనిషిని తరిమేసిన తరువాత సభ యథాప్రకారం కొనసాగింది. సభ ముగిసిన తరువాత అన్నదమ్ములిద్దరు చెల్లెలిని చూడ్డానికి వెళ్లారు. దారిలో అప్పటి మనిషి కోమింటాంగ్ నగర సమితి కార్యాలయం దగ్గర కనిపించాడు.

"ఇప్పుడే ఫిర్యాదు చేయడమెందుకు? సభ ముగిసి ఎంతోసేపైంది." లి-యాన్ ముందుకెళ్లి ఆశ్చర్యం నటిస్తూ అన్నాడు.

"నేను రావడం ముందేవచ్చాను. కాని ఇక్కడెవరూలేరు" అన్నాడు డిటెక్టివ్ నమ్మకంగా.

"అబద్ధాలాడకు, నువ్వు గట్టిగా పనిచేస్తున్నట్లు లేవు. అప్రమత్తుడవైనడచుకో, లేకపోతే ఉద్యోగం ఊడుతుంది!" బెదిరింపుగా అన్నాడు లి-యాన్.

"అన్యాయం! నన్నక్కణ్ణుంచి తరిమారు, తన్నినంతపనిచేశారు. మీరిద్దరూ అక్కడ ఉన్నారుకూడా, మీరే సాక్ష్యం చెప్పాలి." పాపం బాగా బెంబేలెత్తాడు.

"గంగలోదూకు. మాకేం!" అని హేళనగా నవ్వాడు లి-యాన్, "మూర్ఖుడు!" అంటూ దార్లో తిట్టాడువాణ్ని. ఇతడి ధోరణి తమ్ముడికి నచ్చలేదు. దూకుడుగా డిటెక్టివ్ కంటపడడం బాగనిపించలేదు యింగ్-చీన్ అన్న ప్రతియోచన వింటాడు. కాని ఈసారి తన అభిప్రాయం వేరు. అన్నకు నచ్చజెప్ప యత్నించాడు. కాని ఫలితం శూన్యం.

"మనమెవరమో వాడికెట్లాతెలుస్తుంది? వాణ్ని హేళనచేయడమంటే కోతి ఆట చూడడమే" అన్నాడు లి-యాన్.

"లి-యాన్‌దే తప్పు" నేను కలుగజేసుకున్నాను. సాహసప్రదర్శనకిది మార్గం కాదు. "వాణ్ని తరమడమేచాలు. మిమ్మల్ని గుర్తించజాలనంత మాత్రాన దుడుకుగా నడవవద్దు. ఒకవేళ గుర్తిస్తే!"

"అయితే వాడికి సాక్ష్యం చెప్తాలే" విషయం మార్చి యింకేమైనా మాట్లాడాలనే ఉద్దేశంతో నవ్వుతూ అన్నాడు లి-యాన్.

కష్టపూరితమైన జీవితం వాడి చురుకైన, జీవంతొణికే వాడి ప్రకృతి మార్చలేక పోయింది. కొద్దిగా బక్కచిక్కి, రంగుమారిందంతే. విద్యార్థుల నల్ల యూనిఫాం తొడుక్కున్నాడు. బిగుతుగా చిన్నదిగా అనిపిస్తుందది. కామ్రేడ్ హో మెంగ్-హ్సి యంగ్‌తో ఉంటూ కలసి పనిచేస్తున్నప్పటినుండీ చైనీస్ కమ్యూనిస్టు యూత్‌లీగ్‌లో చేరి కార్మికులమధ్య నివసిస్తున్నాడు. పూతుంగ్‌కు షాంఘైనుండి పశ్చిమ జిల్లానుంచి నది మీదుగా తరుచూ ప్రయాణంచేశాడు. ప్రతి పెద్దఫ్యాక్టరీలోనూ మిత్రులున్నారు. ఇటీ వలే ఏంజరిగిందో ఉత్సాహంగా చెప్పాడు. పెన్-పెన్ మధ్య వాడి మాటలకు వన్నె చిన్నెలు కూర్చడానికి ఏదో మాట్లాడేది. యింగ్-చీన్ మాత్రం మౌనంగా ఉన్నాడు.

ఒకసారి పూతుంగ్‌లోని ఒక నూలుమిల్లులో జరిగే సభలో పాల్గొంటున్నప్పుడు తీవ్రంగా జ్వరంవచ్చి స్పృహతప్పి పడిపోయాడట. ఎవరి కంటపడకుండా ఉండాలని వాడకంచేయని ఒక యంత్రంకిందదాచి చెత్త దూది అంతా కప్పారట. ఇట్లా ఫోర్మన్ గద్దకండ్లనుండి కాపాడారు. ఇంకొకసారి ఒక ప్రైవేట్ ప్రాధమిక పాఠశాల ఆడిటోరి యం(సభమందిరం)లో ఒక వినోదకార్యక్రమం ఏర్పాటుచేశారు. అందులో లి-యాన్ ఒక పెట్టుబడిదారు వేషం కట్టాడు బలిసినట్లు కనిపించాలని దూది కూరుకున్నాడు.

"అమ్మా, లి-యాన్ ఎన్నోపాటలు రాశాడు తెలుసా...." ఇంకెవరైనా ఆటంక పరుస్తారనే భయంతో ఏకంగా ఒకపాట మొదలుపెట్టింది.

ఈ మేడలన్నీ కట్టిందెవరు?
కూర్చొని పొట్టచెక్కలయ్యేట్లు నవ్వేదెవరు?
వాడి గేటుదగ్గర కాపలాకాసేదెవరు?
బీదకార్మికులకై స్థైర్యంగా పోరాడే దెవరు?

ఈ మేడలు కట్టింది కార్మికులు
పొట్టచెక్కలుగా నవ్వేది పెత్తందార్లు,
గేటువద్ద శ్రామికుణ్ణి శోధించేది కోమింటాంగ్—
బీదలకై గట్టిగా పోరాడేది కమ్యూనిస్టులు.

"ఆగండి!" ఇంకోపాట అందుకొని ఎవరూ ఆటంకపరచవద్దని చెయ్యివూపింది:

వినండి శ్రామిక విషాదగాధను
గంటమోగగనె లేస్తారైదుకు,

కాల్చిన రొట్టె ఫలహారానికి,
గంజి బియ్యం మధ్యాహ్నానికి,
ఉత్సాహ ముడుగును సాయంత్రానికి,
సొక్కి ఇంటికి చేరిన మనిషికి
మనసు ఒప్పునా బట్టలు ఉతుక,
మనసు ఒప్పునా వంట చేసుకొన,
ఏమిచేయుటో చెప్పండి,
అది ఎంత విచారమొ చూడండి!

చెల్లెలింకా సమయం తీసుకోవడం ఇష్టంలేని లి-యాన్ ఆమెను వారించాడు.

'ఓ అదా! అదెంతపాటిది. యింగ్-చీన్ ఏమిచేశాడో విను. వాడొక్కసారి వాళ్ళ యజమాని మా ప్రచారపత్రాలు అచ్చువేసేట్లు పన్నాగం పన్నాడు. తరువాత అతడు యింగ్-చీన్‌ను వాడితోటివాళ్లను విందుకుపిలిచి ఈ కరపత్రాల విషయం ఎవరికీ చెప్పవద్దని బతిమాలాడు. వీడు ఇటు మనపనీ చేసిపెట్టాడు, బాగా మెక్కనూమెక్కాడు."

మనసారా నవ్వాడు. బలే గమ్మత్తని నేనూ నవ్వాను యింగ్-చీనూ నవ్వాడు. కాని కొంత పట్టిపట్టి "ఇందులో గమ్మత్తేముంది? ఇది మామూలు విషయమే" అంటున్నట్లు బెదురుగా చూశాడు.

మాకు తెలియకుండానే చాల పొద్దుపోయింది. పిల్లల విషయాలు తెలిసి చాల సంతోషమైంది. పార్టీ పోషణలో పెరిగి విద్యాబుద్ధులు నేర్చి స్వరక్షణ చేసుకోవడమే గాకుండా ఎంతటి క్లిష్ట పరిస్థితుల్లోనైనా శత్రువును ఓడించగల వారయ్యారు. తల్లిగా నా గుండెలమీది బరువు దిగినట్లయింది.

"కొంచెం ఇంటి పనుల్లో సాయపడుతూండు. మెతకగా ఉండి ప్రతి చిన్న విషయానికీ ఏడవకు" అంటూ పెన్-పెన్‌కు సలహా యిచ్చాను.

"నేనేడువు మాని ఎంతో కాలమైంది" టక్కున జవాబిచ్చింది.

"చూ తల్లికెంతో కృతజ్ఞురాలినని చెప్పు" బయల్దేరుతూ అన్నాను.

''అమ్మా, దిడ్డి తలుపుంది. నిన్ను సాగనంపుతా రా'' లన్నాడు లి-యాన్.

పిల్లలు నన్ను గట్టిగా పట్టుకొని పోనివ్వలేదు. మళ్ళీ మళ్ళీ ముద్దాడి బయల్దేరాను. నా వెనక రానివ్వలేదు సాగనంపటానికి.

''అమ్మా, మళ్ళీ ఎప్పుడొస్తావే'' కంటనీళ్లతో అడిగింది పెన్-పెన్.

"వీలుచిక్కినప్పుడల్లా ఒస్తానమ్మా. నువ్వేడుపుమాని చాలారోజులైందన్నావు కదూ?"

సిగ్గుపడి ముఖం తిప్పుకుంది. ఇదే అదనుకొని వెంటనే బయటపడ్డాను.

## 13

ఏప్రిల్ 8. ఉదయం మబ్బులుకమ్మి వర్షమొచ్చేట్లనిపించింది. పెందలకడ లేచి కిటికీ తెరచాను. చల్లనిగాలి కొట్టింది. ఇల్లు ఊడుస్తుంటే చి-హో వచ్చి షువాంగ్-లిన్ మళ్ళీ ఏడుస్తుందని చెప్పాడు. చాలరోజుల నుండి దానికి తీవ్రంగా జ్వరంవస్తుంది. తగ్గేటట్లు కనిపించలేదు. నేను గదిలోకెళ్ళి దాని నుదుటిమీద చెయ్యివేసి చూశాను కాలిపోతూంది. చెల్లెలిని జాగ్రత్తగా చూసుకోమని చి-హోకు గట్టిగా చెప్పి ఏదైనా మందు కొనుక్కొద్దామని వెళ్లాను.

నాంకింగ్‌రోడ్డెప్పుడూ పాదచారులతో నిండి ఒక వింత ప్రశాంతతో ఉంటుంది. నేను వెళ్లిన ప్రతి దుకాణమూ మూసేఉంది. మరీ తొందరగా వచ్చానా అనిపించింది. అక్కడ ఉన్నవల్లా ఫలహారాలమ్మే కొట్లే. అవి కూడా ఎన్నో లేవు. ప్రతి చౌరస్తా దగ్గరా పోలీసువాళ్లున్నారు. అనుకోకుండా దారినపోయేవాళ్ల కమ్యూనిస్టులు "తిరుగుబాటు" చేద్దామనుకుంటున్నారని మాట్లాడుకోవడం విన్నాను.

పార్టీ ప్రధాన శాఖలన్నీ ఇంకా శాంఘైలోనే ఉన్నాయి. కేవలం ఎర్రసైన్యం గెరిల్లా దాడులమీద కేంద్రీకరించడం, సోవియటు ప్రాంతాలను ఏర్పరచడానికి బదులుగా సార్వత్రిక తిరుగుబాటుకు పిలుపు ఇవ్వబడింది. ప్రదర్శనలు, సభలు నగరాల్లో విరివిగా నిర్వహించబడ్డాయి. సంకేతం ప్రకారం ఏదో టపాకాయలు పేల్చగానే ప్రజలంతా గుంపులు గుంపులుగా నినాదాలిస్తూ, కరపత్రాలు వెదజల్లుతూ, ట్రాం కార్లను చెల్లాచెదురుచేస్తూ గుమిగూడేవారు. అప్పటికప్పుడే పోలీసువాళ్లు వచ్చి తిరుగుబాటుదార్లను అరెస్టు చేసేవారు. అజ్ఞాత సంస్థలెన్నో ఛిన్నాభిన్నమయ్యేవి. ముఖ్యంగా అకాలపు 'వామపక్ష' అవకాశవాదం విప్లవాదర్శాలను బాగా దెబ్బతీసింది.

ఆనాడు సెలవూకాదు. ఒక ఉత్సవ సందర్భమూకాదు. మరి శత్రువు యెందుకంత జాగ్రత్తపడ్డాడు? అకస్మాత్తుగా నాకు కారణం స్ఫురించింది. కొద్దిరోజులకు పూర్వమే నాంకింగ్. హ్సికువాంగ్ జిల్లాలోని హోచి ఫ్యాక్టరీలో సమ్మెజరిగింది. పది మంది కార్మికులకుపైగా క్రూర బ్రిటిషు నావికుల తుపాకీగుండ్లకెరఅయ్యారు. పార్టీ

ఈ సమ్మెదారులను బలపరుస్తూను, సామ్రాజ్యవాదుల ఇటీవలి ఘోర దురంతాలను నిరసిస్తూను ఒక బహిరంగసభ యేర్పాటు చేయనున్నట్లుగా లి-యూన్ తెలియజేశాడు. అందుకేనా శతృవింత అపరిమత్తతతో మెలగడం?

చివరికెలాగో షువాంగ్-లిన్ కొరకు మందైతే సంపాదించాను కాని దానితో లాభంలేకపోయింది. మధ్యాహ్నానికల్లా స్పృహతప్పింది. నేను ఎత్తుకొని ఒక పెద్ద తువాలు బాగా చుట్టబెట్టాను. కొద్దిసేపట్లోనే బిడ్డపోయింది. పక్కపై పడుకోబెట్టి గుండెలుపగిలేట్టు ఏడ్చాను. అటు చూడ్డానికే భయమేసింది. అయినా సమాధిచేయక తప్పదుకదా. అందుకే ఆ ఏర్పాట్లకని బయల్దేరుదామనుకున్నాను. అప్పుడే ఎవరో, వేలాది ప్రజలు జండాలుపట్టుకొని పీకింగ్ థియేటర్ కెదురుగా సమావేశమయ్యారని అన్నారు. వారేం చేయనున్నదీ ఎవరికీ తెలియదు. నిజంగానే వీరు తిరుగుబాటు చేస్తారా అని నన్ను నేనే ప్రశ్నించుకున్నాను. నా పిల్లలు ఎన్నో రోజులుగా వీధుల్లో కరపత్రాలు పంచుతున్నారని విన్నాను వారు ఎక్కడ సభలు జరిగినా తప్పక హాజరౌతారు, ఇవ్వాళ మాత్రం ఎందుకు వదులుతారు. నాకు ఫలితం తలుచుకొనేసరికి కంపరం పుట్టింది. ఇంతలోనే వీధుల్లో పోలీసు కార్ల రణగొణ ధ్వనులు వినొచ్చాయి. అబ్బా, ఇక అంతా రక్తపాతమేకదా అనుకున్నాను. ఏంచేయాలో ఎంతమాత్రమూ తోచలేదు. కొద్దిసేపట్లో తుపాకి కాల్పులు వినిపించాయి. పోలీసులు ప్రేక్షకులందరినీ చెదరగొట్టారు. దుకాణదారులు తలుపులు వేసుకున్నారు. వెంటనే పైకివెళ్లాను. ఇప్పటికీ బిడ్డశవంవైపు చూడడానికి గుండెచాలలేదు. ఎందుకోగాని షువాంగ్-లిన్ కూడా పీకింగ్ థియేటర్ వద్ద ప్రాణాలు కోల్పోతున్నవారి మాదిరిగానే ప్రాణత్యాగం చేసినట్లనిపించింది.

సాయంత్రం కాటికాపరితో వెళ్ళి బిడ్డను శ్మశానంలో పూడిపించాను. వస్తూవస్తూ చుసాన్-మై ఇంటికి వెళ్లాను. పిల్లలింకా తిరిగిరానందుకు ఆందోళన చెందుతూంది.

"పిల్లకేమైఉండవచ్చు! ఉదయమనగా వెళ్లారు. ఈ కాల్పులకు కార్లచప్పుళ్లకు ఏమైందనుకోవాలో తోచడంలేదు" అంటూ కళ్లనీళ్ల పర్యంతమైంది.

"బెంగపడకు, ఏదైనా జరిగితే వాళ్ళల్లో ఒకరైనా తిరిగిరావాలి. అయినా అంత చురుకైనవాళ్ళనెవరు కాల్చగలరు."

నేనేమైనా సమాచారాలు తెలుస్తాయిగదా అని వెళ్తే కొత్త విపత్తు ఎదురైంది. ఆ మానసికహింసలో నన్ను నేను నిగ్రహించుకో ప్రయత్నించాను. పాపం చు-తల్లిది బాల మెత్తనిమనసు. ఎన్నో విషయాలవల్ల బాగా కలతపడ్డది.

లి-యాన్ ఉంటున్న మిద్దెకు వెళ్లాను కాని అతడు లేడు. తలకు కట్టుతోవున్న అతని సహవాసి లీని చూడగానే ఏదో పెద్ద ఉపద్రవమే సంభవించిందనుకొన్నాను. నాలో బలం క్షీణించి భూమికతుక్కుపోయాను. లీయే నన్నులాగి కుర్చీలోకూర్చోబెట్టాడు.

"తావోతల్లీ ఏం జరిగింది? లి-యాన్ కొరకు చూస్తున్నావా? ఇప్పుడే ఏదో సభకు వెళ్లాడు."

"అమ్మ! అయితే మీరిద్దరూ క్షేమంగా తప్పించుకున్నారన్నమాట" అని నిట్టూర్చాను.

"మేము దాదాపు.... అంటే చావుతప్పి కన్నులొట్టపోయిందన్నమాట. మొత్తానికి బయటపడ్డాం" ఒక గ్లాసెడు నీళ్లందిస్తూ అన్నాడు.

"నీ తలకేమైంది?"

"ఆ.... ఏదో గీరుకుపోయింది. కొంచెం మెర్క్యూరీ క్రోమ్ పట్టించాను. తొందరలోనే తగ్గిపోతుంది. కొంచెం విశ్రాంతి అవసరమన్నారు...." వివరాలనవసరమనుకున్నట్లు మాట్లాడాడు.

"మరి చూసాన్-మై, ఆమె ఎక్కడుంది?"

"లియాన్‌తోనే వెళ్లింది"

"సరే, ఏదో ప్రాణాలు నిలిచాయి అదే సంతోషం."

కేవలం సిగరెట్ ఫ్యాక్టరీలు, సిల్కు ఫ్యాక్టరీలు, నూలు మిల్లుల కార్మికులే కొన్ని వేలమంది వచ్చారన్నాడు సభకు లియాన్. కొంతమంది విద్యార్థులు కూడా ఉన్నారట. అసలు టిబెట్ రోడ్డుపై నింగ్‌పోగిల్డ్ వద్ద సభ జరుపాలని నిర్ణయమైంది. తొమ్మిది గంటల ప్రాంతాన ఎక్కువ మంది గుమిగూడకముందే ప్రదర్శకులలోని కొందరు ప్రత్యేక గార్డులు కరపత్రాలు పట్టుకొని గిల్డు గేట్లలోనికి చొచ్చుకొచ్చారు. ప్రజలు వారి ననుసరించే ప్రయత్నంలో ఉండగానే ఇంటర్నేషనల్ సెటిల్మెంటు పోలీసులు కార్లలో వచ్చి అయిదుగుర్ని అరెస్టు చేశారు. కరపత్రాలు స్వాధీన పర్చుకొని ప్రజలను చెదరగొట్టి గిల్డు గేట్లు మళ్ళీ మూశారు. తరువాత గుంపంతా రెండవ సభాస్థలమైన క్వెయి చౌ రోడ్డు మీద ఉన్న పీకింగ్ థియేటర్‌కు వెళ్లారు. దారిపొడుగునా ప్రజలను బాధపెట్టడంవల్ల థియేటర్ వద్ద దాదాపు ఐదు వందల మంది మాత్రమే గుమిగూడారు. లి-యాన్ ఒక సిగరెట్ ఫ్యాక్టరీగుండా ఒక 20 మందిని తీసుకుపోయాడు. కాని వారు ప్రవేశించడమే తడవుగా థియేటర్ మేనేజర్ తలుపులకు తాళంవేసి పోలీసులను పిలిచాడు. ఈలోపుగా బయటి గుంపు "బ్రిడ్జలు కొట్టండి, బ్రిడ్జలు కొట్టండి"

అంటూ తాళం పగులగొట్టే ప్రయత్నం చేశారు. పోలీసులు సమీపించేలోపునే పెద్దగా నినాదాలిచ్చి కరపత్రాలు వెదజల్లారు. లి-యాన్, మరికొందరు ఎమర్జెన్సీ ద్వారం పగులగొట్టి బయటపడ్డారు. కాని తీరాచూస్తే పోలీసులు అడ్డంగా ఉన్నారు ఇత్తడి పొన్నుల గదలతో. గార్డ్ లీడర్ లియూ పోలీసుల్లో ఒకణ్ణి పడగొట్టి, ప్రజలందర్నీ లోపలికి చొరబడమని తోసుకుంటూ వెళ్లాడు. అప్పుడే కాల్పులు మొదలయ్యాయి. లి-యాన్ పెన్-వెన్ చెయ్యిపట్టుకొని వీధికి మరోవైపుకు లాక్కెళ్లాడు. పెన్-వెన్ వెనక్కు చూసి "అన్నా, లియూను పడగొట్టారు" అంటూ భయంతో అరచింది. వాళ్లు అతడికి సహాయం చేయడానికి వెళ్లారు కాని అతడప్పటికే చనిపోయాడు. తరువాత కార్మికులంతా మరోపక్క వీధిలో మళ్ళీ గుమిగూడసాగారు. వాళ్లంతా ఒక వెల్లువలా పొంగుతూ ఎర్ర జండాలను బాగా ఎత్తుగా పట్టుకున్నారు.

లీ ఇంకా ఇట్లా అన్నాడు. "ఎలాగైతేనేం మనకు జరిగిన నష్టం అపారం. పది మంది పైగా చావడమో, గాయపడడమోగాక ఎంతో మంది అరెస్టు కూడా అయ్యారు. లి-యాన్ ఇప్పుడేదో సభలో ఉన్నాడు. నువ్వు అతణ్ణి గురించి ఇట్లా ఆందోళన చెందుతుంటావని కూడా అతడికి తెలుసు."

"సరే, కృతజ్ఞురాల్ని. ఇక కొంచెం విశ్రాంతి తీసుకో" అని సెలవుతీసుకొని చక్కగా చు-తల్లి ఇంటికి వెళ్లాను ఈ వార్త తెలుపుదామని.

చాలరోజుల వరకు లి-యాన్ కనిపించలేదు. కాని అతడి కార్యక్రమాల గురించి ఎవరో ఒకరు చెప్తుండేవారు. అతడు చాలరోజుల వరకు దుస్తులు మార్చుకోలేదనో, లేదా అవి మాసిపోతే తానే స్వయంగా ఉతుక్కొని ఎండలోనో, పొయ్యిదగ్గరనో ఆరేసి అవి ఆరేంతవరకూ ఇంట్లోనే ఉంటున్నాడనో తెలియవచ్చింది. షువాంగ్-లిన్ మరణ వార్త విని చాల విచారపడ్డట్లు గూడా విన్నాను. యింగ్-చీన్ అప్పుడప్పుడు అతణ్ణి చూడ్డానికి వెళ్ళి, అతడు లేకపోతే ఏమి జరుగనున్నదో తెలియక అయిదారు గంటల వరకు ఎదురుచూసేవాడు. అప్పుడప్పుడు పిల్లలిద్దరూ గోడలమీద నినాదాలురాయడానికి వెళ్లేవాళ్లు. ఒక్కొక్క అక్షరమూ వంతులవారీగా 'చాంగ్‌కై-షేక్ ముర్దాబాద్' అంటూ రాసేవాళ్లు. ఈ చిన్నపాటి వార్త నాకెంతో ఊరటనిచ్చేది; నేను వారు వివిధ కార్యక్రమాల్లో పాల్గొనడం సునాయాసంగా ఊహించుకోగలిగాను.

చూస్తుండగానే మే వచ్చింది. శత్రువు మరింత జాగరూకతతో ఉంటున్నాడు. షాంఘైలోని ఉత్తర దక్షిణ జిల్లాలలోని ప్రధాన స్థలాల్లో పోలీసులు, సైనికులు నియమించబడ్డారు. కాలి నడకవారెవరూ ఉత్తర రైల్వే స్టేషను ప్రాంతాన గుంపులుగా నడవడం నిషేధింపబడింది. అనుమానం తోచిన ప్రతివారినీ అరెస్టు చేశారు. ఫ్రెంచి

కన్వెషన్ నుండి ఇంటర్నేషనల్ సెటిల్మెంటును వేరుచేస్తున్న గేట్లవద్ద అదనపు పోలీసు కాపలా పెట్టబడింది. విదేశీ పోలీసు ఆఫీసర్లు సైకిళ్ళమీద వీధులంతటా గస్తీ తిరుగుతున్నారు. ప్రధాన మార్గాలపై ఫిరంగులు కూడా నిలిపారు. ఈ నెల కార్మికులంతా "వీధుల కధివతులై" ప్రదర్శనలమీద ప్రదర్శనలు చేసే కాలం. అందుకే శత్రువు మే నెలను ప్రమాదకాలంగా పరిగణిస్తాడు.

ఇంత దౌర్జన్యకాండ జరిగినా పిల్లలు బెదరలేదు. పైగా మరింత ఉత్సాహంతో తమ పని కొనసాగిస్తున్నారు. మే మొదటితేదినాటి అంతర్జాతీయ శ్రామికదినంనాడు, లి-యాన్ 500 మంది బాలశ్రామికుల సభ నొకటి వార్డ్‌రోడ్‌లోని గ్రేహౌండ్ రేసింగ్ ట్రాక్ వద్ద నిర్వహించాడు. సభ ముగిసేటప్పటికి ప్రతివారు ప్రదర్శనలో పాల్గొనే నిశ్చయాని కొచ్చారు. లి-యాన్ పెన్-వెన్‌కు ఒక ఎర్రజెండా వార్తాపత్రికలో చుట్టి ఇంతకుముందే ఇచ్చి యిట్లా ఆదేశించాడు. "ఒక పొడుగు వెదురుబొంగు పట్టుకో. పరేడర్లు సిద్ధంకాగానే దానిపై జండా ఎగురవేయడానికి సైగచేస్తాను." అతడు పెన్-వెన్‌కు ఒక పెద్ద కేక్‌ముక్క యిచ్చి 'ఏదైనా జరిగితే ఈ రొట్టె నములుకుంటూ, అదంతా చూస్తున్నట్లు నటించు' అన్నాడు.

"సరే కాని నువ్వుమాత్రం ముసిల్ది ముచ్చటుపెట్టినట్లు పెద్ద హంగామా చేస్తున్నావు." అని బయటికి నెట్టేసింది నవ్వుతూ. పెన్-వెన్ నిర్ణీతసమయానికి రేసింగ్ ట్రాక్‌కు వచ్చింది. ఆ గుంపులోవున్న లి-యాన్‌ను కనిపెట్టగలిగింది. అతడు సైగ చేసినవెంటనే జండావిప్పి చాల ఎత్తుగా ఎగిరేసింది.

పూ....య్, పూ....య్ అంటూ పోలీసుల విజిళ్లు కీచుమన్నాయి. ఇంతలో గుంపులో అయోమయం సృష్టించి చెదరగొట్టడానికి ఒక పెద్ద నల్లని శవపేటికను గుంపులోనుండి లాక్కొచ్చారు. పెన్-వెన్ కేక్ నముల్దామనుకోవడానికి ముందే ఒక పెద్ద చేయి ఆమె భుజంమీద పడింది.

'ఎక్కడికి పారిపోదామనుకుంటున్నావ్?' అని గురుమన్నాడు పోలీసువాడు.

'ఏమిజేస్తున్నావ్: నన్నెందుకు పట్టుకున్నావ్?' అంటూ ఏడుస్తూ గింజుకుంటూ అడిగింది.

'ఈ జండా ఎక్కడినుండి వచ్చింది?'

'నాకేంతెలుసు. నేనొట్టిగానే చూస్తున్నాను.'

నెత్తిమీద ఒక్క పెట్టుపెట్టి దాదాపు యీడ్చుకుపోయాడు ఒక ట్రక్కు దగ్గరికి. చాలామంది పట్టుపడ్డారు. అయినా పిల్లలు లి-యాన్ పట్టుబడకుండా దాచగలిగారు.

సహాయక సమితి (Relief Committee) లోని వారీవిషయం తెలిసి పిల్లలకు ఉత్సాహం కలిగేటందుకు జేలుకు మిఠాయిలుపంపే ఏర్పాట్లు చేశారు. చాల రోజుల తరువాత పార్టీ సంస్థనుండి ఒక మనిషి వచ్చి నాకో విషయం చెప్పాడు. పెన్-పెన్ అరెస్టయినపుడు తన పేరు వాంగ్ఆ-ఎర్ అని చెప్పిందట. కుశలంగానే ఉందనీ నేను చూడటానికి వెళ్లవచ్చుననీ చెప్పాడు.

'ఏదో, కనీసం కేసు తీవ్రంగా ఉన్నట్టులేదు, అంతేచాలు' అనుకున్నాను.

పెన్-పెన్‌ను చూట్టానికి వెళ్ళేటప్పుడు కొన్ని కేకులు తీసుకుపోయాను. ఖైదీ లంతా చిన్నబాలికలే, చూడవచ్చినవారందరూ తల్లులే. నేను గేట్టవద్దే ఎంతోసేపు నిల్చున్నాను. ఇంతలో ఒక నల్లని బక్కని అమ్మాయి కొద్దిగా కుంటుతూ వచ్చింది. అదే పెన్-పెన్. అది పిలువకపోతే గుర్తించేదాన్నేకాను.

'అమ్మా!' ఒకే ఒక్కమాట వినవచ్చింది. మిగితా విషయాలన్నీ బిడ్డ కన్నీటి ధారల్లో కరిగిపోయాయి.

"అః ... అః.... ఇంత పెద్దపిల్లవు, ఏడ్చి ఏం ప్రయోజనం? విషయాలన్నీ వివరంగా చెప్పు."

"అమ్మా!" అంటూ వెక్కివెక్కి ఏడ్చింది. "నన్ను జేలులోపెట్టడానికి వాళ్లకేం హక్కుంది? నేను పరేడ్ చూద్దామని వెళ్లాను అంతే అరెస్టు చేశారు, కొట్టారు" అన్నది.

"ఆహా, నువ్వు ఏడవగలవే!" అంటూ ఒక పోలీసు ఆఫీసరు మావైపు వచ్చాడు. "నీకు తెలిసింది ఒక్క పాడడమేననుకున్నాను. ఇన్ని రోజులనుండీ మమ్మల్నేడిపిస్తున్నావు. ఈ ఏడుపు ముందే ఏడిస్తే ఎప్పుడో విడుదల అయ్యుండేదానివిగా!"

పెన్-పెన్ వెంటనే ఏడుపు ఆపి ఆఫీసర్‌వైపు తిరిగింది.

"ఏడవాలనిపిస్తే ఏడుస్తాను; పాడాలనిపిస్తే పాడుతాను. నీకెందుకు. సంతోషంతో తినడానికేదైనా యిస్తే, ఇక్కడే ఉంటాను."

"ఆ, నాకు తెలుసు, నువ్వేడుస్తున్నట్లు నటిస్తున్నావు. మీరంతా ఒకటే మచ్చు, కమ్యూనిస్టు దొంగలు." ఆత్మతృప్తితో అన్నాడు.

"ఏమిటీ! మీరే మమ్మల్ని మాడుస్తున్నారు, కొడుతున్నారు. కనుక మీరే దొంగలు" అని తీవ్రంగా ఎదురుచెప్పింది.

"నీకెంతకావాలో అంతే అవుతుంది. ఎంత తిడితే అంత ఎక్కువ కాలం ఉంటావు" అన్నాడు వెళ్లిపోతూ.

జేలులో ఆహారం ఘోరంగా ఉంటున్నదని తెలిసింది. పిల్లలు నిరసిస్తున్న కొద్దీ అది చెడిపోయింది. చిట్టచివరికి రెండు చిప్పల తవుడు పోశారు. పెన్-వెన్‌కు జబ్బు చేసింది; టైఫాయిడ్ అని జేలు డాక్టరన్నాడు. అతడిచ్చే మందు తీసుకోనిరాకరించింది పెన్-వెన్. జేలులో రోగమేదైనా దానికి విరేచనం మందే మందుకావడం, యిందుకు కారణం.

పెన్-వెన్ జేలులో వలభైరోజులకు పైగా ఉంది. జబ్బు చేయడమే దానికి కారణం కావచ్చు. జేలునుండి విడుదలైన నాడు పెన్-వెన్‌కు నడవడానికి కూడా శక్తి లేకపోయింది. హాస్పిటల్‌కు రిక్షాలో తీసుకొని పోవలసివచ్చింది.

# 14

మా పార్టీ కార్యదర్శి విభాగము, మా ఉద్యమాన్ని భగ్నం చేయడానికి శత్రువు చేసే ప్రయత్నాలన్నింటినీ విజయవంతంగా వమ్ముచేసింది; మేము మా కార్యాలయాన్ని మరోచోటికి మార్చే అవసరమే కలుగలేదు. అప్పటి పరిస్థితులదృష్ట్యా ఇది చెప్పుకో దగ్గవిషయమే. ఒక సంస్థ స్థాపించబడిన కొద్దిరోజుల్లోనే పోలీసునిఘాకు గురికావడం సహజమే. ఒక సంస్థకు సంబంధించిన కామ్రేడెవరైనా అరెస్టయినప్పుడు కార్యాల యాన్ని మార్చవలసి రావచ్చు, కొన్నిసార్లు రోజుకు రెండు మూడు సార్లుకూడా అవ సరంకావచ్చు. పార్టీ రహస్య సంస్థల రహస్యాలు లాగడానికి శత్రువు ఎంతో మంది ద్రోహులను కొనేవాడు డబ్బుగుమ్మరించి. ఈ జీతులమారి ద్రోహులకు పార్టీ అను పానులు, కార్యక్రమాలు అన్ని తెలిసేవి. ఈ శత్రువు నెదుర్కోవడమే పెద్ద కష్ట మైనపని.

పోరాటం రానురాను మరీ క్లిష్టమైంది. ఇక శత్రువు, శత్రువర్గం ఏజంట్లు ఖైదీలను చంపడం మానారు. దానికి బదులు 'సంస్కరణ గృహాలు', 'ఆలోచనా సంఘాలు' కట్టించి విప్లవకారులను చాలకాలంవరకు తీవ్రంగా హింసించారు; 'కోమిం టాంగ్ పార్టీ సూత్రాల'ను 'నైతిక నియమాల'ను వారి విశ్వాసం సన్నగిలజేయాలని వారిచేత బలవంతంగా చదివించారు, మాలోని బలహీనులను తమ తొత్తులుగా మార్చు కొనడానికి డబ్బు స్త్రీలను, ఉన్నత పదవులను ఎరగా చూపారు. విప్లవాన్ని నాశనం చేయడానికి వారు అనుసరించని మార్గంలేదు. ఇలాంటి భయానక వాతావర ణంలో ఉద్యమాన్ని హాన్యాంగ్‌లో మాదిరి కొనసాగించలేక పోయాం. మే మంతా

రహస్యంగా, ప్రచ్ఛన్నంగా ఉండడానికి నిరంతరం జాగరూకతతో వ్యవహరించాం. పార్టీ కార్యాలయంలోనికి ప్రవేశించడం, బయటపడడం విషయంలో కఠినమైన నియమాలు అమలుపర్చాం. నేనొక సైనికోద్యోగిభార్యగా నటించవలసి వచ్చింది ఎవరైనా వివరాలడిగితే ఆయన దూరదేశంలో కు-చుటుంగ్ ఆధిపత్యంలోనున్న 8 వ పటాలానికి కార్యదర్శి అని చెప్పేదాన్ని. నా మాటలు ఇతరులు నమ్మేటట్లు ఉండాలని అప్పుడప్పుడు సైనిక సంస్థల పెద్ద పెద్ద కవర్లు నా ఉత్తరాలపెట్టెలో వేసేదాన్ని. కొందరు నన్నొక ఉన్నతోద్యోగి ఉంపుడుగత్తెననుకున్నారు. అందుకే గూఢచారుల బారినుండి, దొంగల బారినుండి తప్పుకోవడానికి ఎంతో జాగ్రత్త వహించవలసి వచ్చేది. ఒకసారి ఒక దొంగ మా సంస్థకు సంబంధించిన ఒక యింట్లోపడి కొన్ని రహస్య పత్రాలెత్తుక పోయాడు. అవికాస్తా శతృవుచేజిక్కాయి. అయితే నావద్దకు కేవలం అద్దెవసూళ్ల వాడు, నీటిసరఫరావాడు మాత్రమే వచ్చేవారు. తలుపుదగ్గర గంటమోగగానే చిహో ఒక రంధ్రంగుండా బయట ఎవరున్నారో చూచేవాడు. "మనవాడే, ఇదివరకొచ్చాడు కూడా, తెరవనామ్మా"అనేవాడు మా నిరంతర పోరాటం పిల్లవాణ్ణి నిరంతరం జాగరూకుడుగా ఉండేటట్లు చేసింది. తరచుగా బయటికి పోనివ్వనందున, ఒంటరితనం అనుభవించేవాడు. మట్టిబొమ్మలు చేయడం, మెట్లు యెక్కడం దిగడమే వాని ఆటపాటలు. ఈ పనులు ఆనందాన్ని కలిగించేశక్తి కోల్పోయినాయి. ఇక వాడు తలుపుపిడి 'రిపేర్'చేయడమో, కుళాయి 'సరిచేయడమో' చేసేవాడు. ఇక ఫ్లాష్‌లైట్‌లోని బల్బు 'రేడియో'గానూ బ్యాటరీలు 'టెలిఫోను'గానూ కనపడసాగాయి.

"చి-హో లైటు సరిచేయాలిరా"అంటూ ఏడ్పించేది అక్క.

'ఆ విషయం నాకు వదిలిపెట్టు'అంటూ చొక్కాచేతులు మడచేవాడు. ప్రపంచంలోని సమస్యలన్నీ తన జ్ఞానాంతర్గతాలే అన్నట్లు చేసేవాడు.

"ఏం చస్తావా, కరెంటంటే ఆటబొమ్మకాదు"అంటూ తిట్టేదాన్ని.

పెన్-వెన్ నోటికి చేయి అడ్డంపెట్టుకొని ఫొర్లినవ్వేది. అప్పుడు తెలుసుకొనేవాడు దానివలలో పడ్డట్టు.

"హాఁ.... నువ్వా, నువ్వు మాదానివికాదు." ఇది వాడు ఎవరిగురించైనా అనగల తీవ్రమైనమాట.

పెన్-వెన్ ఆసుపత్రిలోనుండి బయటపడిన పిదప చాలాకాలంవరకు ఇంట్లోనే విశ్రాంతి తీసుకోవలసి వచ్చింది. వెంట్రుక లూడసాగాయి, చర్మమూ పెట్లటం మొదలైంది. అది పూర్తిగా కోలుకోలేదింకా.

ఒకరోజు గంటమోగింది. 'ష్‌....ష్‌....గోలచేయకండి'అన్నది పెన్-వెన్.

సంకేతం వినపడగానే "అమ్మా, మనవాడేనే, వెనుకతలుపు తెరవనా?" అని మారుపలుకు లేకుండా కూర్చున్నాడు.

తరచూ సంకేతం మార్చేవాళ్లం. కొన్నిసార్లు మధ్యవర్తిముందు తలుపుదగ్గర గంటమోగించి వెనుకతలుపుగుండా ప్రవేశించేవాడు. శత్రువు దాడిచేస్తే వారిచేతపడకుండా ఉండటానికిదొక రక్షణమార్గం. తలుపు తెరిచేసరికి వార్తాహరుడు లియూ లోని కొచ్చాడు.

'ఇవ్వాళ ఒక కొత్తవ్యక్తిని తీసుకొచ్చా మిమ్మలను చూడటానికి' అన్నాడు ఆనందాన్నణచుకోలేక.

అతడివెనకే ఒక యువకుడొచ్చాడు లోనికి. నేనతణ్ణి గుర్తించేలోగానే నామెడచుట్టూ చేతులువేసి కౌగలించుకున్నాడు, 'అమ్మా' అంటూ.

"అరె.... లియా... న్!' అని ఆశ్చర్యంతో అన్నాను.

చి-హో 'లి-యాన్! లియాన్!' అంటూ ఉరికి వచ్చాకు. పెన్-వెన్ కూడా 'లి-యాన్!'అంటూ మేడదిగివచ్చి తనూ గొంతుకలిపింది.

"చాలు చాలు. నానుండి లాక్కోవడానికి కాదు తీసుకొచ్చింది. నేనప్పుడప్పుడెప్పైనాపోతే యిక్కడ అప్పచెప్తాను. అంతే. అయినా వదిలిపెట్టకండి" అన్నాడు లి-యూ.

లి-యాన్ నీలంరంగు నూలుబట్టలు వేసికొని, తోలుబూట్లు తొడుక్కున్నాడు. నాకంటె బాగా ఎత్తున్నాడు. చాలా చురుగ్గా ఆరోగ్యంగా ఉన్నాడు. చి-హోను పైకెత్తాడు.

'అబ్బో చాలా పెద్దవాడి వయ్యావురా! ఎత్తలేక పోతున్నాను' అన్నాడు. ఈ మాటకు వాడెంతో సంతోషించాడు.

'ఈ ఆర్నెల్లకుపైగా ఎటుపోయావురా? నీకొరకన్నిచోట్లాచూశా, కాని లాభం లేకపోయింది? చెప్పు' అన్నాను.

'చాలా దూరంవెళ్లానమ్మా, మాస్కో. అంతర్జాతీయ యువకార్మికుల సమావేశానికి వెళ్ళానక్కడికి.'

"సోవియట్ యూనియన్ కే! మరి నాకెందుకు తెలియజేయలేదు?.

నేచెపుదామనే వచ్చాను. కాని సందుమొగనుండీ వెనక్కుమళ్లాను, నేనిక్కడికి రాకూడదని తెలుసుకున్నాను. పోగా, ఎవరిచేతనో ఈ వార్త తెలుపడం నాకు వచ్చులేదు".

[సశేషం]

సమీక్షలు :

# 'మా భూమి'

నాటకం, రచన: సుంకర, వాసిరెడ్డి

ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్

1947–1951 తెలంగాణా సాయుధ విప్లవోద్యమం భారతదేశ ప్రజాఉద్యమాలన్నిట్నీ రాజకీయరంగమంతనూ ఊగించి వేసింది.

అంతకుముందు వరకూ భారతదేశంలో జరుగుతూవచ్చిన ప్రజోద్యమాలకు తలమానికమైన. గుణాత్మకమైన మార్పుగల ఉద్యమం అది. ముందు ముందు అనివార్యంగా రాబోయే ప్రజావిముక్తి యుద్ధానికి నాందిపలికిన, రిహార్సల్ అది. మావో ఆలోచనా విధంతో, చైనా పంథాతో ప్రభావితం అయిన మొదటి ప్రజా సాయుధ పోరాటమది. కార్మికవర్గ పార్టీ నాయకత్వాన జరిగిన భూస్వామ్య వ్యతిరేక రైతుల గ్రామీణ ప్రజల సాయుధ విముక్తి పోరాటం.

ఎన్నో గ్రామాలను పల్లెప్రాంతాలను ప్రజాపీడకుల బారినుండి విముక్తి చేసి వేల వేల యకరాల భూమిని దున్నేవారే తమలో తాము పంచుకొని ఆయుధ సహాయంతో గెరిల్లా దళాల నాయకత్వంలో వాట్ని కాపాడుకొన్నారు. ప్రజలే తమను తాము పరిపాలించుకొనటం రుచిచూచారు.

తెలంగాణ పల్లెల పట్టణాల ప్రజలను భయభ్రాంతుల జేసేసి, బందరు కోటపై సైతం నిజాం జండా నెగరేస్తానన్న రజ్వీ రజాకారు ముఠాను తుక్కు తుక్కుగా తన్ని మన్నుకరిపిస్తున్న సమయం. నిజాం ఫ్యూడల్ భూస్వామ్య వ్యవస్థ పునాదులు కదలి కంపించిపోయింది. "బానిస జనశల్యములను పేర్చికూర్చి నిర్మించిన నీ రాక్షస సింహాసన మదిగదిగో కదలుతోంది" అన్న సమయం. 'గోలకొండజిల్లాకింద నీ గోరికడతాం కొడకో', అని ప్రజలు పాడుకొనటమేకాదు గోరీ కట్టే సమయమే ఆసన్నమైంది.

సరిగా ఆ సమయంలో నెహ్రూ కేంద్రప్రభుత్వం తన యావత్ మిలిటరీశక్తిని కేంద్రీకరించి నిజాంను అదుపులోకి తెచ్చేమిషతో వచ్చి నిజాంను ఆ వ్యవస్థను రక్షించి రైతువిప్లవాన్ని రక్తపుటేరుల్లో ముంచింది. వేల ప్రజాయోధులను ప్రభుత్వ మిలిటరీ బలిగొన్నది. నిజాం రజాకారులను మించిపోయిన దౌర్జన్యకాండతో ప్రజలపై దాడి

చేసింది. పటేల్ నెహ్రూ సైనిక రాక్షసత్వం వేలాది ప్రజల నాయకులను చిత్రవధలు చేసి విప్లవాన్ని అణచగలిగారు. అందుకుతోడు అప్పుడు నాయకత్వం వహించిన కార్మిక వర్గ పార్టీకి ప్రజాయుద్ధ పంథాను గురించి దీర్ఘకాలికమైన. సమగ్రి అవగాహనలేదు. ఉద్యమం విరమించబడింది.

గత మూడు సంవత్సరాలుగా దాదాపు ఆనాటి ఉద్యమప్రాంతమంతటా ఆ పోరాటపు పునాదిపైననే కొత్త ప్రారంభాలతో సాయుధ రైతుగెరిల్లా చర్యలు సాగుతూ ఆ జ్యోతిని పునర్జీవింపజేశారు.

ఆ విప్లవ పోరాటపు రజతోత్సవ సమయానికి మళ్ళీ యీనాడు అదే ఉద్యమం యింకింత సమగ్రి అవగాహనతో ప్రాథమికదశను పూర్తిచేసుకొంటూ ముందుకు పోతున్నది.

ఆనాటి సాయుధ గెరిల్లా రైతు ఉద్యమ ప్రభావంగా తెలుగు నాట అంతటా గేయాలు, కథలు, నాటకాలు బహురూపాలుగా అసంఖ్యాకంగా అవతరించాయి. అలాంటి కళారూపాల్లో మకుటాయమానంగా నిలిచింది 'మా భూమి' నాటకం.

పటేల్ నెహ్రూల రాక్షస సైన్యం ప్రవేశానికి ముందు గ్రామాలను ప్రజాపీడకుల నుండి విముక్తిచేసే ఘట్టం వరకూ ఒక గ్రామం సీను యీ నాటకం.
క్లుప్తంలో కథ యిది —

బందగీ- 10 ఏళ్ళనాడు ఒంటరిగా దేశ్‌ముఖును ఎదిర్చి నిలిచి న్యాయం కోసం పోరాడి ఆ దేశ్‌ముఖుతో హత్యకావించబడ్డాడు. అతని స్మృతి చిహ్నంగా చిన్న సమాధి నిర్మించారు ప్రజలు. అతని స్మారక దినంనాడే (ఉర్సు) ప్రజలు చుట్టుపట్ల గ్రామాల నుండి ఆ సమాధివద్దకు వచ్చిపోయేవారు. అది క్రమంగా పెరుగుతూ పెద్ద ఉత్సవంగా తయారయింది.

ఈ గ్రామ ప్రజలు దేశ్‌ముఖుకుకోపం వస్తుందని తెలిసికూడా ఉర్సుకు వెళ్ళారు. అక్కడి నుండివచ్చి వీరారెడ్డి అనే రైతు నాయకత్వాన సంఘం ఏర్పాటుచేసుకుంటారు. అతని భార్య సీతమ్మ, చెల్లె కమల దాదా అనే ముసలి ముస్లిం రైతు, ఒక యల్లమంద సుభాన్, రామిరెడ్డి అనే రైతులు కలిసి శపథంచేసి సంఘాన్ని ప్రారంభిస్తారు. క్రమంగా గ్రామ ప్రజలందరనూ సంఘంగా కూడగడతారు. దేశ్‌ముఖు యింట్లో పనిచేసే సేవకుడు రాముడుతోసహా గ్రామం అందరూ ఏకమవుతారు. దేశ్‌ముఖూ, పట్వారీ వెంకటాప్రవు, అమీనూ చాలా కుట్రలు చేస్తారు. మస్తాన్‌లాంటి రౌడీలతో దౌర్జన్యాలు చేయించుతారు. పోలీసులను ఉపయోగించుతారు. అయినా ఆ కుట్రలను, దౌర్జన్యాలను ఎదిరించి ప్రజలు ఏకంగా నిలబడతారు.

ఒక రోజున పోలీసుబలగంతో దేశ్‌ముఖ, పట్వారీ అమీన్, మస్తాన్ అందరూ కలిసి గ్రామంపై విరుచుకపడతారు. వీరారెడ్డిని ముందే అరెస్టుచేసి గడీలోవుంచుతారు. గ్రామంపై పడినపుడు వీరారెడ్డి లేకున్నా ప్రజలందరూ ఆర్గనైజ్ అవుతారు. కారం, రాళ్ళు, వడిశెలలు వగైరా ఆయుధాలతో ఎదుర్కొంటారు. పోలీసు కాల్పులు జేస్తారు. సీతమ్మ, దాదా కాల్పుల్లో మరణించారు. గ్రామ ప్రజలు యింకింత పట్టుదలతో పోలీసు నెదుర్కొని ఓడించి దుష్టకూటమి అందర్నీ గ్రామం నుంచి తరిమివేశారు. వీరారెడ్డిని విడిపించుకున్నారు. పట్వారీ పట్టుబడితే భయం చెప్పి క్షమార్పణ చెప్పించుకొన్నారు. గ్రామాన్ని ప్రజలే పరిపాలించుకొనటం ఆరంభించారు. దేశ్‌ముఖ భూములను ప్రజలు వశం చేసుకొన్నారు. ఇదీ క్లుప్తంగా కథ.

వాస్తవానికి వాస్తవంగానూ, ఆదర్శానికి ఆదర్శంగానూ నాటకం చాలా ఉత్తేజం కల్గించేదిగా వుంది. సీతమ్మ, దాదా పాత్రల చిత్రీకరణ చదివే వారికి, వినేవారికి మామూలు ప్రజలను కదిలించేట్టుగా వుంది.

గేయాలు ప్రజలను ఉద్రూతలూగించేట్టు పోరాట ప్రచారంగా శక్తివంతంగా వున్నయ్.

ఈ నాటకాన్ని ఆనాడు తెలుగుదేశం అంతటా వేలాది గ్రామాల్లో 300 నాటక దళాలు తయారయి ప్రదర్శించారు. ఈ నాటక ప్రదర్శనే ఆ విప్లవ మహోద్యమంలో అంతర్భాగంగా ఒక ఉద్యమరూపమే ధరించింది. డాక్టర్ రాజారావుగారి నాయకత్వాన రాష్ట్ర ప్రజా నాట్యమండలి పట్టణాల్లో ప్రదర్శించి వేలాది లక్షలాది ప్రజల ముందు తెలంగాణా ఉద్యమ సందేశాన్ని ప్రతిభావంతంగా అందజేశారు. ఈ నాటకం తెచ్చిన అలజడికి భయపడిపోయి ప్రభుత్వం నిషేధించింది.

మళ్ళీ యీ నాటికి విశాలాంధ్ర ప్రచురణ కర్తలు ముద్రించారు. ఆ ఉద్యమం పునర్జీవిస్తున్న యీ సమయంలో ఉద్యమం యొక్క రజతోత్సవ సమయంలో యీ ముద్రణ రావటం సంతోషకరం. ఆనాడు ఉద్యమానికి నాటకానికి ఎలాంటి సంబంధం వుందో యీనాడూ నేటి ఉద్యమానికి ఉపయుక్తంగా కొన్ని మార్పులతో (అవసరమైతే) నాటకాన్ని ప్రదర్శిస్తూ ప్రజా కళాకారులు ఉద్యమానికి సహాయకారులు కావచ్చు.

---

[మా భూమి (నాటకం) రచన: సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, ఏలూరు రోడ్డు, విజయవాడ-2 మొదటి ముద్రణ 1947 ఐదవ ముద్రణ మార్చి 1972, వెల రు. 2/- ]

---

# జాతి సమస్య - మార్క్సిస్ట్ దృక్పథం

జాతి సమస్యను మార్క్సిస్టు దృక్పథం నుంచి పరిశీలించే ఈ రచనను స్టాలిన్ 1912-13 సంధి కాలంలో వియన్నాలో ఉండి రచించాడు. లెనిన్ ఈ రచనను ప్రశంసించాడు. "ప్రస్వీష్చేనియి" (వికాసం) అనే పత్రికలో 1913 ఆరంభంలో మూడు భాగాలుగా వెలువడింది.

సోవియట్ విప్లవానికి నాలుగైదేళ్లముందే వెలువడిన ఈ రచన జాతి సమస్యలను గురించీ, వాటి పరిష్కారం గురించీ అన్ని దేశాలవారికీ ఉపకరించే విషయాలున్నాయి.

రష్యాలోనే విప్లవ ప్రతీపశక్తులు విజృంభించి జాతీయవాదం ప్రజలలో చీలికలూ, వైషమ్యాలూ విషంలాగా వ్యాపించి, సమిష్టి దృక్పథాన్ని ఛిన్నాభిన్నం చేస్తున్న కాలమది. "దూమ" (Duma) చట్టబద్ధంగా ఏర్పడి, అది అవలంబించిన చర్యలు జాతీయవాదాన్ని ఉధృతం చేశాయి. యూదులలో "జీయనిజం" (Zionism) వ్యాప్తి చెందింది. పోలండులో జాతీయ దురభిమానమూ, తాతార్లలో సమైక్య ఇస్లాము తత్వమూ, ఆర్మేనియా, జార్జియా, ఉక్రాయిన్‌లలో జాతీయవాదమూ, సాధారణ ప్రజలలో యూదులపట్ల విద్వేషమూ చెలరేగాయి.

అంటువ్యాధిలాగా ప్రజలలో వ్యాపించిన ఈ ధోరణులను రష్యను సోషల్ డెమోక్రాట్‌లు (కమ్యూనిస్టు - మార్క్సిస్టులు) ఎదుర్కోవలసిన అవసరం ఏర్పడింది. అంతర్జాతీయతా, వర్గపోరాటంలో సమైక్యతా ప్రజలకు బోధించటానికి మరొక పార్టీలేదు. ముఖ్యంగా జాతీయవాదం అమిత తీవ్రరూపందాల్చిన సరిహద్దు ప్రాంతాలలో సోషల్ డెమోక్రాట్లు అత్యంత దీక్షతో జాతీయవాదాన్ని ఎదుర్కోవలసి వచ్చింది.

కాని సరిహద్దు ప్రాంతాలలోని సోషల్ డెమోక్రాట్లు కొందరు ఈ విధిని నిర్వహించటంలో కృతకృత్యులు కాలేకపోయారు. ఒకప్పుడు సమైక్యతను అవలంబించిన "బూంట్" (Bund, లిథువానియా, పోలండు, రష్యాలలోని యూదు శ్రామికుల సంస్థ; యూదు పెటీబూర్జువాలు దీనిని 1897 అక్టోబరులో స్థాపించారు) కేవల యూదు జాతీయాశయాలకు దిగజారిపోయింది.

కాకసస్‌లో సోషల్ డెమోక్రాట్లు బూంట్ దారేతొక్కి, పూర్వం నిరాకరించిన "జాతీయ సాంస్కృతిక స్వతంత్ర ప్రతిపత్తి" (నేషనల్ కల్చరల్ అటానమీ) అర్థంలుగా కావాలన్నారు.

ఇలాంటి విచ్ఛిన్నకర ధోరణులమధ్య స్టాలిన్ జాతి సమస్యలగురించి విపులంగా చర్చించాడు. "నేషన్" (ప్రజ) అనే మాటనూ "రేస్" అనే మాటనూ కూడా మనం "జాతి" అనే అంటున్నాం. అది మన పరిభాషలో లోపం. స్టాలిన్ చర్చించినది వివిధ మానవ జాతులగురించి కాదు, "ప్రజ" గురించి. ఎలాటి మానవ సమూజాన్ని మనం "ప్రజ" అంటాం అన్న ప్రశ్నకు, "ప్రజ అంటే ఒక జాతి కాదు, ఒక తెగ కాదు" అని స్టాలినే సమాధానం చెప్పాడు. అందుచేత ఈ సమీక్షలో జాతి అనే మాట "ప్రజ" అన్న అర్థంలోనే గ్రహించాలి.

జాతికి ఈ దిగువ లక్షణాలుండాలి.

1. చారిత్రికంగా సంఘటితమైన మానవ సమూజం జాతి. అయితే సైరస్, అలెగ్జాండర్లు స్థాపించిన సామ్రాజ్యాలు చారిత్రికంగా ఏర్పడినవే అయినా వివిధ జాతుల, తెగల కలగాపులగం. అవి తేలికగా కలిసేవి, తేలికగా చీలిపోయేవి. జాతికి (ప్రజకు) స్థిరత్వం ఉండాలి. కాని అదికూడా చాలదు. రష్యా, ఆస్ట్రియాలలో స్థిరమైన మానవ సమూజాలున్నప్పటికీ అవి ఏక ప్రజ గలవి కావు. అందుచేత

2. ఒకే భాష ఉండటం జాతికి అవసరం. అయితే, ఒకే భాష మాట్లాడే వారంతా ఒకే జాతి (ప్రజ) కానవసరం లేదు. ఇంగ్లాండులోనూ, ఐర్లాండులోనూ, అమెరికాలోనూ ఒకే భాష మాట్లాడతారు, కాని మూడు దేశాలవాళ్లూ మూడు భిన్న జాతులు.

3. ఒకేప్రదేశానికి (territory కి) అంటిపెట్టుకుని ఉండటం జాతికి ఒక ముఖ్య లక్షణం. దీనికితోడు జాతి యావత్తూ ఒకే ఆర్థిక వ్యవస్థలో శ్రమ విభజనద్వారా పాలుపంచుకోవాలి.

4. ఇంతేగాక జాతి అన్నదానికి దాని సాంస్కృతిక ముద్ర ఉండాలి.

పైన చెప్పిన లక్షణాలలో ఏది లోపించినా అది జాతి అనిపించుకోదు.

జాతీయ లక్షణాలు ఉంటే చాలు మిగిలినవన్నీ ముఖ్యం కాదన్న వాదనను స్టాలిన్ ఖండించారు.

ఉదాహరణకు యూదుల కందరికీ ఒకే రకమైన జాతీయ లక్షణం (సంస్కృతి) ఉన్నది. కాని వారు ప్రపంచమంతా చెదురుమదురుగా ఉన్నారు. (ఇప్పుడు ఇజ్రాయిల్ ఉన్నదనుకోండి.) ఏ దేశంలోఉంటే యూదులు ఆ దేశపు భాష మాట్లాడతారు, ఒక ఆర్థిక వ్యవస్థలో భాగస్వాములు కారు. వారికి సమంగా ఉన్నదల్లా మత సం

స్కృతి మాత్రమే. (ఇస్లాము మత సంస్కృతి ప్రాతిపదికపై పాకిస్తాను ఏర్పడటం కూడా అప్పటికి జరగలేదు.)

ఆ మాటకువస్తే జాతీయ ముద్రనుబట్టిచూస్తే అమెరికాకు వెళ్లిపోయిన బ్రిటిషు వాళ్లదీ, బ్రిటిషువాళ్లదీ ఒకే సంస్కృతి. కాని ఇంగ్లండులోనూ, అమెరికాలోనూ పరిస్థితులు ఎంత భిన్నంగా ఉన్నాయంటే, రెండు జాతులూ త్వరలోనే వేరయిపోయాయి.

యూదు జాతిని కాగితంమీది "జాతి" అన్నాడు స్టాలిన్. "సోషల్ డెమోక్రసీ (అంటే మార్క్సిజం) జాతీయ కార్యక్రమాలు తయారుచేయవలసినది అలాటి జాతుల కోసం కాదు.... ఏకంగా కదిలి, చర్యలు తీసుకోగల నిజమైన జాతులకోసం వాటిని ఉపేక్షించటానికి లేదు" అన్నాడాయన.

మనం మొట్టమొదట అనుకున్నట్టుగా, జాతి అనేదాన్ని ప్రజ అనే అర్థంలో గాక మానవజాతి అనే అర్థంలో బేవర్ (యూదు జాతీయతను ప్రతిపాదించిన వాడు) వాడుతున్నట్టు కనబడుతున్నాడనీ, అలాచేసి గందరగోళం సృష్టిస్తున్నాడనీ కూడా స్టాలిన్ అన్నాడు.

## జాతీయోద్యమాలు

జాతి అన్నది చారిత్రికంగా ఏర్పడినది మాత్రమే గాక ఒక చారిత్రిక దశలో— పెట్టుబడిదారీ వృద్ధిపొందే దశలో ఏర్పడినది. ఆ దశలో పెట్టుబడిదారీ ఫ్యూడలిజమును రద్దుచేసి మనుషులను ఒకే జాతికింద సంఘటిత పరిచింది. పశ్చిమ యూరపులో బ్రిటిషు, ఫ్రెంచి, జర్మను, ఇటాలియను మొదలైన జాతులు ఇలా ఏర్పడినవే. ఇవి స్వతంత్ర రాజ్యాలు (స్టేట్స్) కూడాను.

తూర్పు యూరపులో దీనికి భిన్నంగా వివిధ జాతులతో కూడిన రాజ్యాలు ఏర్పడ్డాయి. ఆస్ట్రియా, హంగరీ, రష్యా ఈ తరగతివి. ఆస్ట్రియాలో జర్మను జాతి వారు రాజకీయంగా పురోగమించి ఉండి, ఆస్ట్రియాలోని జాతులను ఏకంచేసి రాజ్యం ఏర్పాటు చేశారు. హంగరీలోని జాతులను సమీకరించినది మాగ్యార్ జాతివారు. రష్యాలో వివిధ జాతులను ఏకం చేసినది "మహా రష్యన్" జాతి.

తూర్పు యూరపులో కలిగిన పరిణామాలు ఫ్యూడలిజం నిర్మూలన కానప్పుడే సాధ్యమవుతాయి. ఆ పరిస్థితిలో పెట్టుబడిదారీ బలహీనంగా ఉంటుంది. దుర్బల జాతులు ఆర్థికంగా పుంజుకుని దృఢమైన జాతులుగా రూపొందలేకపోతాయి.

అయితే ఆ పరిస్థితి అలాగే ఉండిపోలేదు. పెట్టుబడిదారీ వృద్ధి అయింది. వర్తకమూ, రవాణా సదుపాయాలూ అభివృద్ధి కావటమూ, నగరాలు వెలయటమూ జరిగింది. అట్టడుక్కు తొక్కివేయబడిన దుర్బల జాతులు బలం చేకూర్చుకుని చైతన్యం పొందాయి. పత్రికలూ, థియేటర్లూ, శాసనసభలూ జాతీయాభిమానాలను బలపరిచాయి. కొత్తగా పుట్టుకొచ్చిన మేధావివర్గం జాతీయాభిమానాలను పెంపొందించింది.

కానీ, ఈ ఆలస్యంగా మేలుకున్న జాతులు స్వతంత్రి రాజ్యాలుగా పరిణామం చెందే అవకాశం లేదు. పాలకవర్గంగా పాతుకుపోయిన జాతి వారిని విరోధిస్తుంది. కాలాతీతమైపోయింది! అందుచేత, ఆస్ట్రియాలో జెక్, పోల్ వగైరా జాతులూ, హంగరీలో క్రోట్ వగైరా జాతులూ, రష్యాలో లెట్, లిథువానియన్, ఉక్రాయిన్, జార్జియన్, ఆర్మేనియన్ వగైరా జాతులూ తమ జాతీయతలను పెంపొందించుకున్నాయి. పశ్చిమ యూరపులో స్వాతంత్ర్యం లేకుండా దిగబడిపోయిన జాతి ఐరిష్ జాతి ఒకటే. అది జాతీయోద్యమ పోరాటం సాగించింది. అలాగే తూర్పు యూరపు దేశాలలోని జాతులు కూడా జాతీయోద్యమాలు సాగించాయి.

ఈ సంఘర్షణ పాలకవర్గానికీ— దానికి చెందిన బడా బూర్జువా వర్గానికీ, పీడిత జాతులకు— వాటికి చెందిన పెటీబూర్జువా వర్గానికీ మధ్య కొనసాగింది. లేదా, పీడిత జాతులకు చెందిన "జాతీయ" బూర్జువా వర్గం ఏకమై అధికారం చలాయించే జాతి శాలూకు పాలకవర్గాన్ని ప్రతిఘటించింది. సంఘర్షణలో బూర్జువావర్గానిదే ముఖ్యపాత్ర.

ఈ సంఘర్షణకు మూలకారణం "సొంత" వ్యాపారం (మార్కెట్). వ్యాపారం ద్వారానే బూర్జువాలు జాతీయవాదం నేర్చుకుంటారు. కాని బలవంతమైన జాతి అడుగునఉన్న జాతిని ఎక్కిరానివ్వదు. (తూర్పు పాకిస్తానువారి ఆశయాలను పశ్చిమ పాకిస్తాను అణచినట్లు) అందుకు తగిన నిర్బంధ చర్యలు శీఘ్రంగా జరుగుతాయి.

ఆర్థిక సంఘర్షణ రాజకీయ సంఘర్షణగా పరిణమిస్తుంది. ఈ సంఘర్షణలో బక్క జాతుల కదలికకూ, భాషకూ, వోటింగుహక్కులకూ, స్కూళ్లకూ, మతం వగైరాలకూ ప్రతిబంధకాలూ, నిషేధాలూ ఉత్పత్తి అవుతాయి. పాలకవర్గం "పెద్ద కులం"గా వ్యవహరించటం కూడా ఈ చర్యల ఆశయాలలో ఒకటి.

ఇంత వత్తిడి వచ్చాక పీడిత జాతికి చెందిన బూర్జువాలు తమ జాతికి చెందిన వారిని "మాతృదేశం" నినాదంతో రెచ్చగొడతారు. తమ సమస్య జాతికంతకూ చెందినదంటారు. ప్రజలు విర్లిప్తంగా ఉండక, చైతన్యం ప్రదర్శిస్తారు. (బంగ్లా దేశ్) జాతీయోద్యమం అలా ప్రారంభమవుతుంది. ఆ ఉద్యమంలో పోలిచేరి

యనులూ (కార్మికులూ), కర్షకులూ ఎంతబాగా పాల్గొంటే జాతీయోద్యమం అంత బలంగా ఉంటుంది.

బూర్జువా జాతీయవాదాన్ని కార్మికవర్గం ఎంతవరకు బలపరుస్తుందనేది వర్గ పోరాటాన్నిబట్టీ, కార్మికుల వర్గ చైతన్యాన్నిబట్టీ సంఘటననుబట్టీ ఉంటుంది. కార్మికులకు తమ "జెండా" వేరే ఉన్నది గనక, చైతన్యవంతమైన కార్మికవర్గం బూర్జువా పతాకను ఆశ్రయించనవసరం ఉండదు.

ఇక కర్షకులు నిర్వహించేపాత్ర జాతిపీడన యొక్క స్వభావాన్నిబట్టి ఉంటుంది. ఐర్లండులోలాగా పీడన భూములకు కూడా విస్తరించినప్పుడు కర్షకులు అధిక సంఖ్యలో జాతీయోద్యమంలో పాల్గొంటారు.

ఈ అంశాలను పురస్కరించుకొని జాతీయోద్యమం బహుళ ప్రజోద్యమంగా వృద్ధికావటమో, లేక చిన్న చిన్న సంఘర్షణలకింద తునిగిపోయి, "సైన్ బోర్డుల" కోసం కీచులాటలుగా మారటమో జరుగుతుంది.

జాతీయోద్యమ స్వభావం సర్వత్రా ఒకటిగా ఉండదు. అది ఉద్యమంయొక్క ఆశయాలనుబట్టి మారుతుంది.

పైన చెప్పిన దానినిబట్టి, పెట్టుబడిదారీ బలపడే దశలో తలఎత్తే జాతీయోద్యమాలు బూర్జువా వర్గాలమధ్య సంఘర్షణలే అన్నది స్పష్టం అవుతుంది. బూర్జువావర్గం ఒక్కొక్కప్పుడు శ్రామికవర్గాన్ని జాతీయోద్యమంలోకి లాగగలగటంవల్ల అది సమగ్ర జాతీయోద్యమం అయినట్టు పైకి కనపడవచ్చు— కాని అది అభాస: వాస్తవానికి అది బూర్జువా వర్గానికి చెందిన ఉద్యమమే. (అలాంటి ఉద్యమం విజయవంతం కావటం జరిగితే ఆ విజయఫలితాలు శ్రామికులకు చెందబోవని త్వరలోనే స్పష్టమవుతుంది.)

అంటే, జాతీయ పీడనను ప్రోలిటేరియన్ వర్గం ప్రతిఘటించరాదని కాదు. జాతి పీడన ఆ వర్గాన్నికూడా బాధించేదే. జాతి పీడన అంతం కాకుండా ఆ వర్గం తన బుద్ధిబలాన్ని స్వేచ్ఛగా అభివృద్ధిచేసుకోలేదు. అంతేకాదు, జాతి పీడన మూలంగా ప్రజల దృష్టి వర్గపోరాటాల మీదినుంచి సార్వజనీనమైన జాతీయ సమస్యవైపు మళ్లుతుంది, వర్గ సామరస్యం అవసరమన్న ప్రచారం ఫలించి, శ్రామికుల బానిసత్వానికి వీలు కలుగుతుంది. ఇంతేగాక, వివిధ జాతుల ప్రోలిటేరియనుల సమైక్యతకు విఘాతం కలుగుతుంది. జాతులమధ్య వైషమ్యాలు పెరుగుతాయి. పరస్పర హత్యాకాండ సాగుతుంది. "విభజించి పాలించ"టానికి చక్కని వాతావరణం ఏర్పడుతుంది. ఆ వాతా

వరణంలో అన్ని జాతుల ప్రోలిటేరియనులను ఏకం చెయ్యటమనేది సాధ్యంకాదు. (మన దౌర్భాగ్య దేశంలో ఇదంతా మన కళ్లఎదటనే జరిగింది, జరుగుతున్నది.)

కాని శ్రామికులకు కావలసింది సమస్తజాతుల శ్రామికవర్గ సమైక్యత, బూర్జువా వర్గ దాస్యం నుంచి సంపూర్ణ విముక్తి. అందుచేత వారు అన్నిరకాల జాతి పీడననూ ప్రతిఘటిస్తారు. వివిధ జాతుల స్వయం నిర్ణయ హక్కును సోషల్ డెమోక్రాట్లు (కమ్యూనిస్టులు) బలపరుస్తారు.

జాతియొక్క స్వయం నిర్ణయాధికారం అంటే ఆ జాతియొక్క గమ్యాలను నిర్ణయించే హక్కు ఆ జాతికే ఉండటం; జాతి జీవితంలో ఇతరులు వేలుపెట్టటంగాని, స్కూళ్లను నాశనం చెయ్యటంగాని, ఆచారాలను మార్చటంగాని, హక్కులను నిగ్రహించటం గాని బలాత్కారంగా చేసే హక్కు ఉండరాదు.

అంత మాత్రాన కమ్యూనిజం ప్రతి జాతియొక్క ప్రతి ఆచారాన్నీ, జాతీయ సంస్థనూ సమర్థిస్తుందని కాదు. ప్రతి జాతికీ తన పూర్వస్థితికి పోయే హక్కు ఉన్నప్పటికీ, అలాటి నిర్ణయాలు తీసుకునే అధికారం జాతీయ సంస్థలకు లేదు. కమ్యూనిజం ప్రోలిటేరియనుల హక్కులను కాపాడుతుంది. జాతుల స్వయం నిర్ణయాధికారంకోసం కమ్యూనిజం పోరాడటమంటే, జాతుల పీడన విధానాన్ని అంతమొందించటమూ, జాతులమధ్య సంఘర్షణకు దారితీసే అవకాశాలను రద్దుచేయటమూనూ, వర్గ చైతన్యంగల ప్రోలిటేరియట్ అవలంబించే విధానానికీ బూర్జువా విధానానికీ ఇక్కడే తేడా— బూర్జువా విధానం జాతీయ పోరాటాలను ఎగదోసి, జాతీయోద్యమాలను తీవ్రతరం చెయ్యటానికీ, సాగదీయటానికీ చూస్తుంది.

జాతీయోద్యమం అనేది ప్రధానంగా బూర్జువా ఉద్యమం కావటంచేత అది బూర్జువా వర్గం భవిష్యత్తుతో ముడిపడి ఉంటుంది. బూర్జువా వర్గం పతనంతోగాని అది పతనం కాదు. సోషలిజం వస్తేగాని శాంతి పూర్తిగా నెలకొనదు. పెట్టుబడిదారీ వ్యవస్థలో కూడా జాతీయోద్యమాలను తగ్గుముఖంలో ఉంచి, వాటి వేళ్ల తెగగొట్టి, సాధ్యమైనంత వరకు శ్రామిక వర్గానికి వాటివల్ల హాని జరగకుండా చూడవచ్చు. కాక పోతే దేశంలో పూర్తి ప్రజాతంత్రం నెలకొని, అందులోని జాతులు స్వేచ్ఛగా అభివృద్ధి చెందే అవకాశం ఉండాలి. (ఉదాహరణలు: స్విజర్లాండు; అమెరికా.)

## జాతీయ సమస్య

జాతిలోని అత్యధిక సంఖ్యాకులు— ముఖ్యంగా ప్రోలిటేరియనులు— బాగుపడాలంటే దాని జీవిత విధానం ఎలా తీర్చి దిద్దాలి, దాని రాజ్యాంగం ఎలా రూపొందాలి?

జాతికి స్వతంత్రి ప్రతిపత్తి (అటానమీ) ఉండాలి. దానికి వేరుపడే హక్కు (right of secession) కూడా ఉండాలి. కాని ఈ రెండు హక్కులూ సర్వకాల సర్వావస్థలయందూ అత్యధికసంఖ్యాకులకు (ప్రోలిటేరియనులకు) లాభకరం కాకపో వచ్చు. స్వతంత్ర ప్రతిపత్తా, విడిపోవటమా, సమాఖ్య (ఫెడరేషన్) లో చేరటమా, ఏది లాభదాయకమన్నది కమ్యూనిజముకు సమస్య. పరిస్థితులు మార్పు చెందుతూ ఉంటాయి: ఒక సమయంలో సరిఅయిన పరిష్కారమార్గం మరొక పరిస్థితిలో అనను కూలం కావచ్చు. చారిత్రిక దశనుబట్టి పరిష్కారం ఉండాలి.

ఒక జాతియొక్క ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక పరిస్థితులు పరిష్కారానికి సూచికలు. రాజకీయ పరిస్థితులు ఎలా పరిణామం చెందుతున్నదీ గమనించి, దానికి అనుకూలంగా జాతియొక్క భావి రాజ్యాంగం నిర్ణయం కావాలి పరిష్కారం జాతి జాతికీ మారుతుంది. జాతి సమస్య పరిష్కారంలో గతితార్కిక దృష్టి అత్యంత ప్రముఖపాత్రి వహిస్తుంది.

(బూంట్‌లాగా) జాతి పమస్యను అలాగ్గా తేల్చిపారెయ్యటం అత్యంతరకరమైనది. (జాతి సమస్య పరిష్కారానికి ఆస్ట్రియాలో అవలంబించిన మార్గాలను బూంట్ వాళ్లు రష్యాలో యూదు 'జాతి' సమస్యకు అన్వయించజూడటాన్ని స్టాలిన్ వివరంగా ఖండించాడు.)

"జాతీయ సంస్కృతీ స్వాతంత్ర్యం" (కల్చరల్ నేషనల్ అటానమీ) వినాదం ఒకటి లేవదీశారు. ఇది అభివృద్ధిలోకి వచ్చి, సాంస్కృతిక, సాహిత్య పరిణతిగల జాతులకు వర్తిస్తుంది. "కాకసస్‌లో అనేక తెగల వాళ్లున్నారు. వారికి వేరు వేరు భాషలున్నాయి, సాహిత్యం వేరు. వారి సంస్కృతి ప్రాచీనమైనది. వారు పరిణామ దశలో ఉన్నారు. కొంతవరకు 'జీర్ణమై', కొంతవరకు అభివృద్ధి పొందుతున్నారు. అలాటి ప్రజలను ఏం చెయ్యాలి?.... ఎలాటి సాంస్కృతిక విషయాలతో వారిని సంఘటిత పరచాలి?" అని స్టాలిన్ అడుగుతాడు. రష్యాలో అజారియన్ జాతివాళ్లు జార్జియా భాష మాట్లాడేవారు. వారి సంస్కృతి టర్కీది. వారి మతం ఇస్లాం. "వారిని మత విషయాలలో ఒకరకంగానూ, ఇతర సాంస్కృతిక విషయాలలో మరొక రకంగానూ సంఘటిత పరచాలా?" అని స్టాలిన్ ప్రశ్న.

వెనుకబడిన జాతులను ఉన్నంతలో ఉన్నత సాంస్కృతిక మార్గంలో ప్రవేశ పెట్టటమే పరిష్కారమార్గం. అలాటి ప్రజలుగల కాకసస్ ప్రాంతానికి ప్రాంతీయ స్వతంత్ర ప్రతిపత్తి ఇచ్చినట్టయితే అక్కడ ఒకే సంస్కృతి అభివృద్ధిచెందే అవకాశం

ఉన్నది. అల్ప జాతులవాళ్లు తమ జాతీయ సంకుచితత్వాలను పోగొట్టుకొని, సంస్కృతిలో పైకి రాగలుగుతారు.

ప్రాంతీయ స్వతంత్ర ప్రతిపత్తివల్ల లాభాలేవంటే, అది ఒక ప్రాంతంలోని వారందరినీ కలుపుకుంటుంది; జాతులపేర ప్రజలను విభజించదు, అలాటి విభజనలను నిర్మూలించి, మరొక రకం విభజనను— వర్గ విభజనను పెంపొందిస్తుంది. కేంద్రం యొక్క దయాధర్మాలమీద ఆధారపడకుండా ప్రాంతీయ నిసర్గ సంపదను వినియోగించుకుని ఉత్పత్తి శక్తులు పెంపొందే అవకాశం కలిగిస్తుంది.

జాతి సమస్య యొక్క పరిష్కారంలో ప్రాంతీయ స్వతంత్ర ప్రతిపత్తి ఒక ముఖ్యాంశం.

ఏ ప్రాంతంలోనూ అచ్చగా ఒకే జాతి ఉండదు; అంతటా అల్పసంఖ్యాక జాతులుంటాయి. పాత వ్యవస్థలోనే ఈ అల్ప సంఖ్యాక జాతుల వారికి అధికసంఖ్యాక జాతి పీడన ఉంటుంది. పూర్తి ప్రజాస్వామ్యం వస్తే ఈ బెడద ఉండదు. చెల్లాచెదురుగా (వివిధ ప్రాంతాలలో) ఉన్న జాతి వాళ్లను ఒక జాతీయసమాఖ్యలో చేర్చే ప్రయత్నం నిష్ప్రయోజనం. ప్రజాస్వామ్యం లేనిచోట అది నిరుపయోగం. ప్రజాస్వామ్యం ఉన్న పక్షంలో అనవసరం.

అల్ప సంఖ్యాకుల ఆక్షేపణలు ఏవి? వారు తమ మాతృ భాషను ఉపయోగించలేరు. వారికి తమ సొంత స్కూళ్లుండవు. మత స్వాతంత్ర్యమూ, కదిలే స్వాతంత్ర్యమూ ఉండవు. అన్ని జాతులకూ అన్ని విషయాలలోనూ సమాన ప్రతిపత్తి ఉండాలి. జాతి విశిష్టతలు నశించాలి, అల్ప సంఖ్యాక జాతులమీద ఆంక్షలుండరాదు.

జాతి సమస్యను గురించి 60 ఏళ్ల క్రితం స్టాలిన్ ప్రకటించిన ఈ అభిప్రాయాలు విముక్తమైన వలస దేశాలన్నిటికీ ఈ నాటికీ వర్తిస్తాయి. బూర్జువా ప్రజాస్వామ్యం జాతుల సహజీవనానికి ఉపకరిస్తుందనటానికి స్టాలిన్ అమెరికానూ, స్విజర్లాండునూ పేర్కొన్నాడు. అమెరికా నీగ్రో జాతి పీడన అలాఉంచి, అక్కడి వివిధ జాతుల మధ్య అనేక విచక్షణలున్నాయి. అమెరికాలో జాతులే కులాలంచే అందులో ఆశ్చర్యంలేదు.

స్టాలిన్ రష్యాలోనే "మహా రష్యనులు" అగ్రజాతిగా తయారై మిగిలిన జాతుల మీద సవారీ చేస్తున్నట్టు చెప్పబడుతున్నది. జెకొస్లొవేకియాలో జెక్‌లకూ, స్లొవాక్‌లకూ పడటం లేదుట.

ఇటీవలి ప్రపంచ చరిత్రలో జాతీయత మరొక రూపంలో సాక్షాత్కరించింది. సామ్రాజ్యవాదులు నీగ్రోల నందరినీ ఒకేగాటకట్టి, వారికి నాగరికత తెచ్చినట్టు రొమ్ములు చరుచుకున్న కారణంగా నీగ్రో జాతీయ సంస్కృతి తలఎత్తింది. ఆఫ్రికాలోని వలసలు దాదాపు అన్నీ ఈ సంస్కృతిని చేపట్టాయి. అమెరికాలోని నీగ్రోలు కూడా ఈ సంస్కృతిని అందిపుచ్చుకున్నారు. నీగ్రో సాహిత్యం అంటూ వెలువడింది. 1956 లో "ఆఫ్రికన్ కల్చరల్ సొసైటీ" పారిస్‌లో సమావేశమయింది. కాని త్వరలోనే వీరందరిదీ ఒకే జాతి అయినప్పటికీ ఒకే జాతీయ సంస్కృతి కాదని స్పష్టమయింది. అమెరికాలోని నీగ్రోల పౌర హక్కుల పోరాటాలకూ, ఆఫ్రికాలోని జాతీయ విమోచన పోరాటాలకూ ఏలాటి సంబంధమూ లేదు.

సంస్కృతి ప్రధానంగా దేశ కాలాలకు సంబంధించి ఉంటుంది. ఆ దృష్టితో చూస్తే ప్రపంచంలోని నీగ్రోలందరూ ఒకే చారిత్రిక పరిణామ దశలో లేరు. వారి సమస్యలు కూడా ఒకటికావు.

అరబ్ సంస్కృతి కూడా ఇలా పెంపొందినదే. చాలా అరబ్ రాజ్యాలు సామ్రాజ్యవాదుల అధీనంలోకి వచ్చాయి. అరబ్ సంస్కృతి హీనంగా చూడబడింది. అందుచేత అరబ్ మేధావులు అరబ్ సంస్కృతిని ప్రపంచానికి నిరూపించే ప్రయత్నం చేశారు. కాని ఆ కృషికూడా ఫలించలేదు. వివిధ అరబ్ రాజ్యాలలో రకరకాల రాజకీయ వ్యవస్థలున్నాయి. సాంస్కృతికంగా ఈ అరబ్ దేశాలన్నీ ఏకం కావటం అసాధ్యమయింది.

ఇలాంటి పరిణామాలు చూస్తే ఒక్క విషయం స్పష్టమవుతుంది, ప్రోలిటేరియన్ నియంతృత్వం లేనిచోట, లేక క్షీణించినచోట, జాతి సమస్యకు సరిఅయిన పరిష్కారం ఉండటం లేదు అందుచేత ఒక దేశంలోని వివిధ జాతుల మధ్య సమైక్యతా, సామరస్యమూ, సమానతా ఉండాలంటే ప్రోలిటేరియన్ నియంతృత్వం తప్ప మరోమార్గం లేదు.

— కొడవటిగంటి కుటుంబరావు

సాహిత్య లేఖలు :

## అవగాహనా లోపం

కుటుంబరావుగారి పుస్తక సమీక్ష "లెనినిజమా సోషల్ సామ్రాజ్యవాదమా?".

తెలుగులో యింత చక్కని రాజకీయ విజ్ఞానాన్నందించటం 'సృజన'కే గర్వ కారణం. కుటుంబరావుగారు ఎంతయినా శ్లాఘనీయులు.

వర్తమాన ప్రపంచ రాజకీయాల గురించి సీరియస్‌గా ఆలోచించే ప్రతి రాజకీయ విద్యార్థి, కార్యకర్త జాగ్రత్తగా అధ్యయనం చేయాల్సిన వ్యాసం.

ఇంత మంచి వ్యాసం ప్రకటించి అదే సంచికలో రష్యా విద్యావిధానాన్ని ఆదర్శ వంతంగా చూపించుతూ ఒక చిన్న రిపోర్టును ప్రకటించటంలో సంపాదకుల అవగాహనా లోపం కనిపిస్తోంది.

రష్యాలో ఒకప్పుడు అన్ని విధానాలతో పాటు విద్యావిధానమూ బాగున్న రోజులున్నయ్. ఇప్పటికీ మన దౌర్భాగ్య దేశంకంటే చాలా విషయాలలో మెరుగుగానే వుండవచ్చుకూడా. కాని రష్యాలో మనం చూడాల్సింది, మనకు కనిపించేదీ క్రమంగా జరుగుతున్న బూర్జువాయీకరణ. నిన్నటిదో మొన్నటిదో కాక యీవేళది మనం చూడాలి. నిన్నటి వారసత్వంగా మిగిలివున్న మంచిని చూపేకంటే యీవేళటి దుష్టత్వం ఫలితంగా పరిణమించబోయే ప్రమాదాన్ని మనం అర్థంచేసుకోవాలి. రిష్యా విధానాలు యీనాడు రష్యాతోసహా ప్రపంచ ప్రజలకు హానికరమయే శత్రు విధానాలు. అమెరికా వలెనే, అంతకు మించి కూడా ప్రమాద భరితాలు. ఉదా: విద్యా విధానమే తీసుకుంటే— అంతస్తుల పోటీలు, ఉన్నతమైన, ధనాన్ని కూడబెట్టగల్గే విద్యా కోర్సుల్లో సీట్లను పొందే విషయంలో హేయమైన సిఫారసుల పోటీలు, విద్య విద్య కోసమేననే అకడమిక్ దృష్టి, స్పెషలిస్టులుగా గొప్పవాళ్ళలో గొప్పగా డబ్బు సంపాదించాలి, పేరు సంపాదించాలి అనే వ్యక్తి స్వార్థం యివన్నీ బాగా బలపడుతున్నవి రష్యాలో. సమిష్టి దృక్పథం స్థానే వ్యక్తిదృక్పథం చొరబడి విద్యారంగాన్ని కలుషితం చేసేయటం బూర్జువా దేశాల్లోలాగనే జరుగుతున్నది. విద్యాలయాల్లో స్వేచ్ఛా చర్చలకు, అభిప్రాయాల అవగాహనకు, డిసెంట్‌కు అవకాశం లేకుండా క్రూరంగా అణచివేస్తూ భీతావహమైన నియంతృత్వం అమలు జరుగుతున్నది.

చేతనయినంతలో యీ పోకడలను ఎత్తిచూపాల్సిన, బయటకు కొనిరావల్సిన 'సృజన' గతకాలపు వారసత్వం మిగిలిపోయిన కొద్దిపాటిగావున్న మంచివాటినే యిప్పటి రష్యా విధానంగా చూపటం అసంబద్ధం. విప్లవోద్యమానికి, విప్లవయుత అవగాహనకు హానికరం.

కుటుంబరావుగారి వ్యాసంయొక్క ప్రాముఖ్యతను పూర్తిగాఅర్థంచేసుకొనివుంటే, అర్థం చేసుకొనే ఆ వ్యాసం ప్రకటించివుంటే యీ చిన్న రిపోర్టును సంపాదకులు

ప్రకటించి ఉండకపోదురు. అందువల్ల సంపాదకులతోసహా విప్లవ రాజకీయాల విద్యార్థులందరూ తప్పక కుటుంబరావుగారి వ్యాసాన్ని మననంచేయాల్సిందిగా కోరుతున్నాను.

— అట్లూరి రంగారావు

## నిజమే

సెప్టెంబర్ సంచికలో సోవియట్ విద్యావిధానం రిపోర్టు(అది 1961 నాటిది అయినప్పటికీ) ప్రకటించడం తప్పే. అప్పటికే కృశ్చేవ్ నాయకత్వాన రష్యాలో రివిజనిజం ప్రవేశించింది దాని కుళ్ళుతనం అన్ని రంగాల్లో వ్యాపించింది

లెనినిజమా, సోషల్ సామ్రాజ్యవాదమా? వ్యాసం అచ్చవుతుండగానే కుటుంబరావుగారు ఒక తోకముక్క (Tail piece) పంపించారు— ఆగస్టు 18 'హిందూ'లో రష్యాలో పెట్టుబడిదారీ వ్యవస్థ కోరుకుంటున్నట్లుగా ఒక వార్త వచ్చింది— అని ఆ వార్త ఇంగ్లీషు దినపత్రికలన్నిట్లోనూ వచ్చింది. హంగరీలో స్వంతఆస్తిపట్ల మమకారం, లంచం, అవినీతి, అసమానతలు అన్నీ బాగా ప్రబలి పాతుకుపోయినట్లు టైమ్స్ ఆఫ్ ఇండియాలో ఒక వ్యాసమే వచ్చింది.

ఈ తప్పుతోపాటు నేను ఇంకో తప్పునుకూడ ఒప్పుకుంటున్నాను. ఏంజెలా డేవిస్ గురించి ఆగస్టు సంచికలో విశాఖపట్నం నుంచి 'ఒక అభిమాని' రాసింది నూరుపాళ్లు నిజం. నేను చెప్పుకొన్నది అర్థంలేని సంజాయిషీ. ఈ విషయంలో నా'సమాధానా'న్ని ప్రశ్నిస్తూ చాల మంది పాఠకులు 'ఒక అభిమాని'ని సమర్థిస్తూ రాసారు. నన్ను యీ విషయంలో సరిదిద్దిన పాఠకులకు కృతజ్ఞతలు.

—— సంపాదకుడు.

## జైళ్ళు - విప్లవ సాహిత్యం

(రెఫరెన్సు: వరంగల్ హైదరాబాద్‌లకు ఒకే చట్టం వర్తించదా?)

తమరు సృజన సక్రమంగాపంపినా జైలు అధికారులు సెన్సారుపేరుతో సి.ఐ.డి. కార్యాలయం, హైదరాబాదు పంపుతుంటారు. అక్కడ నెలల తరబడివున్న తరువాతే మాచేతి కందుతుంటాయి. "మే" తరువాత 18–8–72 న కేవలం ఆగస్టు సంచిక మాత్రం మాచేతి కందింది. జూన్, జులై సృజన సంచికలను జైలు గురించి నిషేధించినట్లుగా జైలు అధికారులు తెలిపారు. తెలుగు-వెలుగు, జ్వాల, స్వాధీనత లాంటి వారపత్రికల స్థితి కూడా యింతే. నెలల తరబడి ఆలస్యంగా అందుతాయి. సాహిత్యం సంగతి మరీఘోరం. అయిదారు మాసాలవరకు మాచేతికిరావు. చట్టరీత్యా నిషేధంలేని సాహిత్యాన్ని కూడా జైలు అధికారులు నిషేధమంటూ యివ్వడంలేదు. 'భాగో-నహి-దునియాకో బద్‌లో' (రాహుల్ సాంకృత్యాయన్), 'బొలీవియా డైరీ', 'ఇదా నాగరికత' (నవల), చైనా కమ్యూనిస్టుపార్టీ 9వ కాంగ్రెస్, 'విప్లవ దృక్పథం', 'భావవిప్లవం' 'సృజన'- జూన్, జులై ప్రతులు మేం తెప్పించిన సాహిత్యం. వీటిని నిషేధించారు.

విశాఖ, రాజమండ్రి మొదలగు జైళ్ళలో జైలు అధికారులే సెన్సార్ చేస్తున్నారు. కాని యిక్కడ సెన్సార్ పేరుతో సి. ఐ. డి. కార్యాలయం, హైదరాబాదు పంపుతూండడం ఎస్. పి. గారి ఉత్తర్వులవల్లే జరుగుతున్నట్లు తెలుస్తున్నది.

ఇకపోతే జైలు విషయం మరీ అధ్వాన్నం. 20 మాసాల నుండి సెల్ నిర్బంధంలో నన్ను, నాతోపాటు కామ్రేడ్ అవధియాగారిని వుంచుతున్నారు. సరియైన ఆహారంకాని సరియైన వైద్యంగాని మృగ్యం. 22-7-72 న సుల్తానాబాద్ I క్లాస్ మున్సబ్ కోర్టులో 120 బి కేసు ప్రాథమిక విచారణ సందర్భంలో పై సమస్యలను పేర్కొంటూ 25-8-72 నుండి నిరాహారదీక్ష చేయనున్నట్లుగా వరంగల్ జిల్లా కలెక్టరు, వరంగల్ జిల్లా పోలీస్ సూపరింటెండెంట్ గార్లకు, ఐ.జి.పి. హోంమంత్రి గార్లకు నోటీసు కోర్టుద్వారా పంపగోరుతూ అందజేశాను. న్యాయమూర్తి వారందరికీ పంపనందున ఐ.జి.పి. వచ్చిన సందర్భంలోకూడ వారి దృష్టికి తెచ్చాను. మీ సమస్యల గురించి ఆలోచించి సమాధానం చెప్తానన్నాడు. కాని జరిగిందిలేదు. జైలు సూపరింటెండెంట్‌కు తిరిగి నోటీసుఅందజేశాను. ముందు అనుకున్నట్లుగా 25-8-72 కాకుండా 1-9-72 నుండి నిరాహారదీక్ష సాగించగలనని తెలియచేస్తూ నోటీసు అంద జేశాను. జిల్లా కలెక్టరు, ఐ.జి.పి. హోంమంత్రి, I క్లాసు మున్సబ్ మేజిస్ట్రేట్ (సుల్తానాబాద్) గార్లకు కూడా పంపడానికి కోరుతూ జైలు సూపరింటెంటుకు అంద జేశాను.

విప్లవ అభివందనలతో—

— వై. ఎస్. మూర్తి
సెంట్రల్ జైలు, వరంగల్.

## ఖయిదీల విజ్ఞానం — జయిలు భద్రతకు ముప్పు.

విశాఖ సెంట్రలు జయిలులోవున్న శ్రీ చౌదరి తేజేశ్వరరావుగార్కి అందజేయవల్సిందని కోరుతూ ప్రపంచం, భారతదేశం, ఆశియాఖండం, ఆంధ్రప్రదేశ్‌లకు చెందిన ఆరు మ్యాపులను శ్రీ విశాఖ స్పెషల్ మేజిస్ట్రేటుగారికిచ్చాను. వారు వాటిని సెంట్రలుజయిలు సూపరింటెంటుగారికిపంపేరు. ఐతే సూపరింటెంటు శ్రీ కపాడియా "జయిలుభద్రత కారణంగా శ్రీ తేజేశ్వరరావుగార్కి మ్యాపులు యివ్వడానికి వీలులేదు" అని త్రిప్పివేశారు. జయిలులో ఖయిదీలకు లోకజ్ఞానంకోసం, భూగోళశాస్త్ర అధ్యయనం కోసం అవసరమయ్యేవి ఏవైనాసరే జయిలు భద్రతకు ముప్పు. యిది కపాడియా గారి రూలు మాత్రమేనేమో.

ఆచంట లక్ష్మణరావు.
అడ్వకేటు, నర్సీపట్నం.

రాజకీయ రసడోల :

## ఇందిరిస్టు గారడీ

[వార్త: కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇందిరా (తెల్లకమ్యూనిస్టులు) తెలంగాణసాయు పోరాట రజితోత్సవాన్ని ఘనంగా తద్దినంగా జరపడానికి నిర్ణయించారు.]

దేఖో దేఖో దేఖో దేఖో
ఇందిరిస్టు గారడీ
రాజకీయ రసడోలలో
పసందైన ప్యారడీ

అలహాబాదు షోకుపిల్లి
కట్టుకున్న కోక
జనంకళ్ళు కప్పేందుకు
ఉప్పలాయికేక

తెలంగాణ వీరబాల
చెరబట్టిన కసాయి
రణరంగం పారివచ్చి
తెగవదిరే సిపాయి

ఇందిరయ్యతో చేసే
కుష్టురోగ సంసారం
పందిరిమంచం సాక్షిగ
విప్లవ వీరవిహారం

తెలంగాణ విప్లవాన్ని
తెగటార్చిన హంతకులు
పసిపిల్లల మాదిరిగా
సవరింతురు గొంతుకలు

తెల్లకమ్యూనిస్టువేయు
పిట్టలదొర వేషం
కాంగిరేసు కొలమానం
తూచిన ఆవేశం

'మంగళపురి మార్క్సు'గారు
వేసినట్టి పథకం
కొంగల మల్లయ్యగాడి
లేవలేని కథనం

కళ్ళముందు విప్లవాన్ని
చూడలేని అంధులు
వెలుగుచూచి ఉలికిపడే
తలకిందు దివాంధులు

దేఖో దేఖో దేఖో దేఖో
ఇందిరిస్టు గారడీ
రాజకీయ రసడోలలో
పసందైన ప్యారడీ.

— బొంబై వాలా

SRJANA Telugu Monthly Oct. '72 Regd. No. H-1088
Regd. No. with Registrar of News Papers 10953/67

అక్టోబర్ **15, 16** తేదీలలో
గుంటూరులో జరుగనున్న

విప్లవ రచయితల సంఘం

## మూడవ మహాసభలకు

మేమందిస్తున్న సాహిత్య హస్తాల్

ఎర్రపిడికిలి— కవితలు— కె. వి. రమణారెడ్డి
సంపాదకుడు— త్రిపురనేని మధుసూదనరావు 3-00

కవిత్వం— చైతన్యం— విప్లవవ్యాసాలు
క్రిటిక్ ఆఫ్ ది టైమ్— త్రిపురనేని మధుసూదనరావు 1-50

లే (రెండవ ముద్రణ)— కవితాసంకలనం 1-50

విప్లవం వర్ధిల్లాలి— కవితాసంకలనం 1-50

బాలాజీ పబ్లిషర్స్
8-81 బజారు వీధి
తిరుపతి 517501